


# 50 వసంతాల ఆంధ్రప్రదేశ్ శాసన సభ

# సభాపతులు - ఉపసభాపతులు

## 50 వసంతాల

## ఆంధ్రప్రదేశ్ శాసన సభ

# సభాపతులు - ఉపసభాపతులు




ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన సభ సచివాలయము
హైదరాబాద్



# తొలిపలుకు

ప్రజాస్వామ్య వ్యవస్థలో శాసనసభ అతి ముఖ్యమైన అంగం. అందులో కీలకమైన వ్యక్తి శాసన సభాపతి. ఒక పార్టీ తరపున ప్రజా ప్రతినిధిగా ఎన్నికైన ఒక గౌరవ సభ్యుడిని సభ్యులందరు కలసి శాసనసభాపతిగా ఎన్నుకుంటారు. ఒకరు స్పీకరుగా ఎన్నికైన తరువాత పార్టీలకతీతంగా అటు అధికార పక్షాన్ని ఇటు ప్రతిపక్షాన్ని, సమాధానపరుస్తూ ప్రజా సంక్షేమం కోసం నిరంతరం ఆలోచించాల్సిన స్థానం అది. సభ్యులందరి అభిప్రాయాలను గౌరవిస్తూ సభా గౌరవాన్ని ప్రజాస్వామ్య విలువలను పరిరక్షించే బృహత్తర బాధ్యతను స్పీకరు నిర్వర్తించాల్సి ఉంటుంది. ఓర్పు, నేర్పు స్థితప్రజ్ఞలతో పాటు అంతిమంగా ప్రజాసంక్షేమ దృష్టికలిగిన వ్యక్తి మాత్రమే స్పీకరుగా రాణిస్తారు.

స్పీకర్ పదవి కత్తిమీద సాము లాంటిది. ఎక్కడ పొరపాటు దొర్లినా అపార్థాలు, శాసనార్థాలు తప్పవు. ప్రజాసంక్షేమానికి సంబంధించిన సమస్య ఎదురైనప్పుడు సంకట స్థితిని ఎదుర్కోవలసివుంటుంది. పార్టీ సిద్ధాంతాలకు అతీతంగా మత ధర్మాలకు, విశ్వాసాలకు భంగం వాటిల్లకుండా ఒక ధర్మాధికారిగా, ప్రజల పట్ల వాత్సల్య పూరితంగా వుండాల్సివుంటుంది. ఏ పక్షానికీ కోపం తెప్పించకుండా సభను నడపడమన్నది అత్యంత సమర్థతతో కూడిన క్లిష్టమైన వ్యవహారం. సభ్యులనుండి, పార్టీలనుండి, స్వవర్గం వారినుండి అనేక రకాల ఒత్తిడులు వస్తుంటాయి. వాటన్నింటిని అధిగమించి కేవలం ప్రజా సంక్షేమమే పరమావధిగా, దూరదృష్టితో సరి అయిన నిర్ణయాలు తీసుకోవాల్సివుంటుంది.

అటు అధికారపక్షం, ఇటు ప్రతిపక్షం వారి అభిప్రాయాలను సమన్వయ పరుస్తూ ప్రజాస్వామ్య విలువలను పాటిస్తూ అంతిమంగా ప్రజల సంక్షేమమే లక్ష్యంగా బాధ్యతలు నిర్వర్తించాల్సివుంటుంది. అంతిమ నిర్ణయం స్పీకర్‌దే అయినప్పటికి నిర్ణయాలు ఎవర్నీ నొప్పించ కూడదు. ప్రజలకు నష్టం వాటిల్ల కూడదు ఇలా అన్ని విషయాలను బేరీజు చేసుకుంటూ సభను నడపాల్సి ఉంటుంది.

శాసనసభ, అధికారయంత్రాగం, న్యాయవ్యవస్థ, పత్రికారంగం ప్రజాస్వామ్యానికి పట్టుగొమ్మలు. ప్రజాస్వామ్య సాధనికి ఈ వ్యవస్థలు నాలుగు స్తంభాల్లాంటివి. ఈ నాలుగు స్తంభాల్లో అత్యధిక శక్తిని కలిగిన విధానాలపై అంతిమ నిర్ణయంచేసే అధికారం చట్టసభకు మాత్రమే ఉంటుంది. చట్టసభ చేసిన నిర్ణయాలను అమలు పరిచేది అధికార యంత్రాంగం. వాటి అమలులో లోటుపాట్లను ఎత్తిచూపేది పత్రికా సమాచార రంగం, దొర్లిన తప్పొప్పుల నిగ్గుతేల్చేది న్యాయవ్యవస్థ. ఈ మొత్తం క్రమంలో చట్టసభలో చేసే నిర్ణయాలే అన్నింటికి మూలం. ఆ నిర్ణయాలు తీసుకునే సమయాన శాసనసభాపతి అతి ముఖ్య భూమికను పోషిస్తారు. కోట్లాది ప్రజల భవితను, సభానిర్ణయాలవల్ల ఏర్పడే పరిణామాలను సభాధ్యక్షుడు దూరదృష్టితో దర్శించగలగాలి.

ప్రజలపట్ల, రాష్ట్ర ప్రగతి పట్ల సునిశిత దృష్టి, గాఢమైన ప్రేమ ఉన్న వ్యక్తులే ఈ స్థానానికి గౌరవాన్ని తేగలరు. అదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఇలాంటి మహోన్నత వ్యక్తులనే స్పీకర్లుగా పొందింది.

అటువంటి మహోన్నత వ్యక్తులకు వారసునిగా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం స్వర్ణోత్సవ వేడుకలు జరుపుకుంటున్న సంతోష సమయాన సభాపతిగా వుండటం నేను ఒక గౌరవంగా భావిస్తున్నాను.

*1956* డిసెంబరు మూడవ తేదీన ఆంధ్రరాష్ట్ర శాసనసభ, హైద్రాబాదు రాష్ట్ర శాసనసభలోని తెలంగాణా ప్రాంత శాసనసభ్యులు సంయుక్తంగా సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఇదే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ మొదటి సమావేశం. అప్పటి నుంచి ఇప్పటి వరకు శాసనసభకు సభాపతులుగా, ఉప సభాపతులుగా బాధ్యతలను నిర్వహించిన వారి గురించి పరిచయం చేస్తూ ఈ స్వర్ణోత్సవ వేడుకల సందర్భంగా ప్రచురితమవుతున్న ఈ పుస్తకానికి తొలిపలుకు రాయడం ఒక సదావకాశంగా భావిస్తున్నాను.

**కేతిరెడ్డి సురేశ్ రెడ్డి**

**సభాపతి,**

**ఆంధ్రప్రదేశ్ శాసనసభ.**

# విషయసూచిక

| క్రమ సంఖ్య | విషయము | పుట |
|---|---|---|

## సభాపతులు


| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు | 1-12 |
| 2. | శ్రీ బి.వి. సుబ్బా రెడ్డి | 13-20 |
| 3. | శ్రీ కె.వి. వేమా రెడ్డి | 21-22 |
| 4. | శ్రీ పిడతల రంగారెడ్డి | 23-30 |
| 5. | శ్రీ రేబాల దశరథ రామిరెడ్డి | 31-34 |
| 6. | శ్రీ దివి కొండయ్య చౌదరి | 35-40 |
| 7. | శ్రీ కోన ప్రభాకరరావు | 41-44 |
| 8. | శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి | 45-50 |
| 9. | శ్రీ తంగి సత్యనారాయణ | 51-52 |
| 10. | శ్రీ నిశ్శంకరరావు వెంకటరత్నం | 53-54 |
| 11. | శ్రీ జి. నారాయణ రావు | 55-56 |
| 12. | శ్రీ పి. రామచంద్రా రెడ్డి | 57-62 |
| 13. | శ్రీ దుద్దిళ్ళ శ్రీపాదరావు | 63-66 |
| 14. | శ్రీ యనమల రామకృష్ణుడు | 67-72 |
| 15. | శ్రీమతి కావలి ప్రతిభాభారతి | 73-78 |
| 16. | శ్రీ కేతిరెడ్డి సురేశ్ రెడ్డి | 79-84 |

| క్రమ సంఖ్య | విషయము | పుట |
|---|---|---|

## ఉప సభాపతులు

17. శ్రీ కల్లూరు సుబ్బారావు 87-90

18. శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ 91-94

19. శ్రీమతి టి.ఎన్. సదాలక్ష్మి 95-96

20. శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ 97-98

21. శ్రీ సి. జగన్నాథరావు 99-100

22. శ్రీ సయ్యద్ రహ్మత్ అలీ 101-102

23. శ్రీ కె. ప్రభాకర రెడ్డి 103-104

24. శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి 105-108

25. శ్రీ ఐరేని లింగయ్య 109-110

26. శ్రీ ఎ. భీమ్ రెడ్డి 111-112

27. శ్రీ ఎ.వి. సూర్యనారాయణ రాజు 113-114

28. శ్రీ ఆలపాటి ధర్మారావు 115-118

29. శ్రీ బూరగడ్డ వేదవ్యాస్ 119-120

30. శ్రీ ఎన్. మహ్మద్ ఫరూక్ 121-122

31. శ్రీ కల్వకుంట చంద్రశేఖర్ రావు 123-126

32. శ్రీ కొప్పుల హరీశ్వర్ రెడ్డి 127-128



శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు

04-12-1956 నుండి 26-02-1962

# శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ మొట్ట మొదటి స్పీకరుగా 1956వ సంవత్సరం డిసెంబరు 4వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1962వ సంవత్సరం ఫిబ్రవరి 26వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు. వీరి హయాంలో మొట్ట మొదటి సారిగా 1960వ సంవత్సరములో అఖిల భారత స్పీకర్ల సదస్సు హైద్రాబాదులో జరిగింది.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు 1881వ సంవత్సరం జనవరి 22వ తేదీన కృష్ణా జిల్లా నందిగామలో శ్రీ లక్ష్మయ్య, శ్రీమతి వరలక్ష్మమ్మ దంపతులకు జన్మించారు. వీరు బందరులో ఎఫ్.ఎ., బి.ఎ. చదివి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుండి న్యాయశాస్త్రంలో పట్టభద్రులై 1906వ సంవత్సరములో కొంతకాలం పాటు న్యాయవాదిగా పనిచేశారు.

మహాత్మాగాంధీ ఇచ్చిన పిలుపుతో న్యాయవాద వృత్తిని వదలి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఆంధ్రులలో శ్రీ కాళేశ్వరరావు ప్రముఖులు. శ్రీ కాళేశ్వరరావు 1922-1947 మధ్యకాలంలో స్వదేశీ ఉద్యమం, ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమం తదితర ఉద్యమాలలో పాల్గొన్నందుకు గాను రాజమండ్రి, తిరుచినాపల్లి, కడలూరు, నెల్లూరు, నాగపూరు తదితర జైళ్లలో కఠిన కారాగార శిక్ష అనుభవించారు.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు 1937-1939, 1946-1951 సంవత్సరాల మధ్య కాలంలో రెండుసార్లు ఉమ్మడి మద్రాసు శాసనసభ్యునిగా ఎన్నికైనారు.

వీరు కేంద్ర సహకార బ్యాంకు స్థాపనకు నిర్విరామ కృషి చేసారు. విజయవాడ పురపాలక సంఘం అధ్యక్షునిగా ఎన్నికై మంచినీరు, మురుగునీటి పారుదల, గ్రంథాలయాల ఏర్పాటు, వంతెనల నిర్మాణం మొదలైన అభివృద్ధి పనులను చేపట్టారు. గ్రంథాలయోద్యమంలో భాగంగా విజ్ఞాన చంద్రికమండలి ఏర్పాటులో శ్రీ అయ్యదేవర ప్రముఖ పాత్ర వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యునిగా, విజయవాడ నేషనల్ ఎడ్యుకేషన్ కమిటీ అధ్యక్షునిగా వీరు ఎనలేని సేవలు అందించారు.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు మంచి రచయిత. వేదాంతం, చరిత్ర, రాజకీయ విషయాల నేపథ్యంపై అనేక రచనలు చేశారు. జైలు శిక్షను అనుభవిస్తూ చైనా జాతీయోద్యమ చరిత్ర, ఈజిప్టు చరిత్ర, ఫ్రెంచి విప్లవ చరిత్ర, అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్రపై పుస్తకాలు రాసారు. ఆయన రాసిన 'నా జీవిత కథ' ఆనాటి ఆంధ్రోద్యమ గాథకు అద్దం పడుతుంది.

శ్రీ కాళేశ్వరరావు 1955వ సంవత్సరం రెండవ శాసనసభ సభ్యునిగా విజయవాడ దక్షిణ నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. వీరు 1962వ సంవత్సరములో జరిగిన శాసనసభ ఎన్నికలలో విజయవాడ దక్షిణ నియోజకవర్గం నుంచి పోటీ చేసి తన విజయం గురించిన వార్త వినకుండానే 1962వ సంవత్సరము ఫిబ్రవరి 26వ తేదీన మరణించారు.

సభాపతిగా శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు సభానిర్వహణలో ఆదర్శవంతమైన సంప్రదాయాలకు బాట వేశారు. 1959, డిసెంబరు 14వ తేదీన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఇచ్చిన రూలింగులో - 98 శాతం సభ్యులకు అర్థమయ్యే విధంగా శాసనసభా కార్యక్రమాలను తెలుగులోనే నిర్వహించకుంటే బాగుంటుంది. శాసనసభలో మన దేశంలో మాట్లాడే 14 భాషలలో మాట్లాడినా నాకేమీ అభ్యంతరం లేదు కాని, అవి అందరికి అర్థం కాకపోతే ప్రయోజనం ఏమి ఉండదు. రాష్ట్రంలో అందరికీ తెలిసిన భాష తెలుగు. ఉర్దూ భాష తెలిసిన వారు కొన్ని లక్షలలో ఉంటారు. కావున ఈ రెండు భాషలను ప్రధాన భాషలుగా పరిగణిస్తున్నాం. ఇది సంప్రదాయంగా వస్తున్నది - అని పేర్కొనడం ద్వారా శాసనసభా కార్యకలాపాలు అందరికీ అర్థమయ్యే విధంగా తెలుగులోనే నిర్వహించుకోవాలని స్పష్టం చేశారు. ఆ విధంగా శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు తెలుగు భాష ప్రాధాన్యతను, ఆ భాష పట్ల ఆయనకు గల అభిమానాన్ని, ఇతర భాషల పట్ల ఆయనకు గల గౌరవాన్ని చాటి చెప్పారు.

సభాపతి అనుమతి లేకుండా సభ్యులైనా, మంత్రులైనా, సభలో ఎటువంటి ప్రసంగాలను గాని, ప్రకటనలను గాని చెయ్యరాదని, వాటి ప్రతులను సభలో పంపిణీ చేయరాదని 1961, ఆగస్టు 11వ తేదీన స్పష్టమైన రూలింగు ఇచ్చారు. కొన్ని సందర్భాలలో సభాపతిని ఛాంబర్‌లో కలిసి వారు చేయదలచుకున్నట్టి ప్రకటన / ప్రసంగాల ప్రతులను

ఆయనకు చూపి ఆయన అనుమతి మేరకే సభలో అట్టి ప్రకటనలను/ ప్రసంగాలను చెయ్యాలని, ఆ ప్రకటనలు / ప్రసంగాలను సభలో పూర్తి అయిన తరువాత మాత్రమే వాటిని పత్రికా ప్రతినిధులకు అందజేయాలని ఆయన తన రూలింగులో చాలా స్పష్టంగా పేర్కొన్నారు.

బహుముఖ ప్రజ్ఞాశాలి, నిరాడంబరుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, హరిజనోద్యమకర్త, విశాలాంధ్ర మహాసభ స్థాపకుడు, గొప్ప కర్మయోగి అయిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు జీవితం నేటి యువతకు, శాసనసభ్యులకు స్ఫూర్తిదాయకమైనది.

# శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

సోదర సభ్యులారా, ఈ రోజున అన్ని పార్టీలవారు ఏకగ్రీవంగా ఈ సభకు నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నందుకు నేను మీకందరకూ హృదయ పూర్వకంగా కృతజ్ఞతను తెలియజేయుచున్నాను. హృదయము సంతోషముతో నిండినప్పుడు మాటలురావు. మీరు అన్నిపార్టీలవారు, అన్నివర్గాలవారు, స్త్రీలు, పురుషులు, ముసల్మానులు, హరిజనులు, భాష మైనారిటిగా నున్న కర్ణాటకులు, గొప్పవారైన డాక్టర్ మేల్కోటేగారు, మొదలయిన వారంతా నన్ను గురించి అతిశయోక్తిగా చెప్పినటువంటి మాటలకు నేను ఏమి జవాబుచెప్పాలో తోచుటలేదు. నేను విద్యార్థిదశలో ఉండగా రాజారామ మోహన్‌రాయ్, స్వామి వివేకానంద మొదలైనవారి గ్రంథాలు చదువుటవలన నాకు దేశసేవచేయాలనే బుద్ధి పుట్టింది. అంతేకాక కందుకూరి వీరేశలింగం, వెంకటరత్నం నాయుడుగార్ల యొక్క సాహచర్యము, శిష్యత్వములవల్ల ఏదో కొంతసేవ చేయాలనిపించింది. ఇంతలో కాంగ్రెసు వచ్చినది. నేను Law College లో చదువుకొనుచుండగానే బెంగాల్ విభజనోద్యమం ప్రచండంగా సాగింది. విద్యార్థుల తరఫున మేము పెద్ద సభచేశాము. విద్యార్థి ఉద్యమంతోనే నా జీవితం ప్రారంభమైంది. "Congratulations to young Bengal", స్వదేశీ ఉద్యమం, మొదలయిన వాటిలో పాల్గొన్నాను. లాల్, బాల్, పాల్‌గార్లకు మేమంతా శిష్యులము. తరువాత మహాత్మాగాంధీగారు వచ్చారు. మళ్లా వెనుకకు పోకుండా అప్పటినుంచి ఉడతా భక్తితో దేశస్వాతంత్ర్యంకొరకు, ఆంధ్రరాష్ట్రంకొరకు, తరువాత విశాలాంధ్రకొరకు నేను సేవచేసిన మాట వాస్తవమే. కాని, ఇతర విషయాలలో నేను సేవచేసినందుకు నాకు ఈ పదవి ఇవ్వడం న్యాయంకాదు. దీనిని నిర్వహించుటకు తగు సమర్థత, అర్హత మున్నగు విషయాలు చాలా ఉన్నాయి. ఇది ఎట్లా ఉన్నా విశాలాంధ్ర రావడమనేది నాకోసం నేను చేసుకున్న పనికాదు. నాకోసమే విశాలాంధ్ర నిర్మాణోద్యమంలో నేను పాటుపడలేదు. మంత్రి పదవి దొరకుతుందనే దృష్టితో స్వరాజ్యంకోసం పాటుపడలేదు. ఏమైనప్పటికిన్నీ ఆంధ్రప్రదేశ్ పేరుతో విశాలాంధ్ర ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ప్రథమ అధ్యక్షునిగా నేను ఎన్నుకోబడినందువల్ల నా జీవితం ధన్యమైనది. మీరంతా నాకు అఖండమైన గౌరవము

కలుగజేశారు. ఇందుకు కాంగ్రెసుపార్టీ నాయకులైన శ్రీ సంజీవరెడ్డిగారికి, ఇతరమంత్రులకు కాంగ్రెసుపార్టీవారికి నేను ముఖ్యంగా కృతజ్ఞతను తెలపవలసియున్నది. ప్రతిపక్షంవారు కూడా వేరే పోటీపెట్టకుండా అధ్యక్షునిగా నన్నే ప్రేమతో అంగీకరించారు. కమ్యూనిస్టుపార్టీవారూ నేనూ అనేకసార్లు పోట్లాడేవారము. అనేక వాగ్యుద్ధాలు చేశాము. నేను అందులోవారికి Enemy No. 1 క్రింద లెక్క. 43-44-45 సం॥లలో మహాత్మాగాంధీ దగ్గరకు పోవడం, P.C. Joshi గారికి, నాకూ జరిగిన వివాదాలూ, ఎలక్షనులలో జరిగిన పోటీలు ఇటువంటివన్నీ మీకు తెలుసును. 46వ సంవత్సరంలోనూ, 50వ సంవత్సరంలోనూ ఎన్నికల యుద్ధాలుజరిగాయి. ఇప్పుడు వాళ్లూ, మనం చాలా దగ్గరకు వచ్చాము. కృశ్చేవ్ బుల్గానిన్ మున్నగువారు మన దేశం రావడంవల్ల వారి దేశంలో కూడా కొంత మార్పు కలిగింది. అంతర్జాతీయ పరిస్థితులవల్ల వారు మనకు దగ్గరగా రావడమే కాకుండా మన అంతర్జాతీయ పాలసీలోని రాజనీతిని, మన నెహ్రూయొక్క రాజనీతిని కమ్యూనిస్టు పార్టీవారు సమర్థిస్తున్నారు. దేశస్వాతంత్ర్యం విషయం లోనూ, ఈజిప్టు విషయం, మున్నగు విషయాలలోనూ కూడా మనలను కమ్యూనిస్టుపార్టీవారు సమర్థిస్తున్నారు.

మనము సోషలిస్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటీ (Law) స్థాపనకు దగ్గరగా వస్తున్నాము. సోషలిస్టిక్ సొసైటీ (Socialistic Society) స్థాపనమేకదా కమ్యూనిస్టుల ఉద్దేశ్యం? డిక్టేటర్‌షిప్ ఆఫ్ ది ప్రోలెటేరియట్ (Dictatorship of the Proletarait) అయిన తరువాత క్లాస్‌లెస్ సొసైటి (Classless Society)ని స్థాపించడమే వారి ఉద్దేశ్యం. క్లాస్‌లెస్ సొసైటి (Classless Society) స్థాపనమే మనము కూడా ఉద్దేశించాము. కాని, మనపద్ధతులు గాంధేయ పద్ధతులు. వారివి టోటలిటేరియన్ (Totalitarian)పద్ధతులు. మన పద్ధతులకు వారి పద్ధతులకు భేదము ఉన్నది. అయినప్పటికీ, ఆదర్శములు ఒకటిగా ఉండవచ్చును. అంతేకాక, విశాలాంధ్ర విషయములో మేమంతా కలిసి పనిచేశాము. విశాలాంధ్ర విషయములో ఆంధ్ర ప్రభుత్వము ప్రకాశం ప్రభుత్వము ఇతర ప్రభుత్వముల మద్దతు మాకు లేనప్పుడు ఏకగ్రీవముగా గట్టిగా సాయపడింది శ్రీ ప్రకాశం. శ్రీ ప్రకాశం క్రింద పనిచేసిన శ్రీ సంజీవరెడ్డి మొదలయినవారంతా మా కన్వెన్షన్సు (Conventions)కు వచ్చారు. మొట్టమొదటనే వారి ఆశీర్వచనములు మాకు ఉన్నవి. 49వ సంవత్సరం నవంబరు 16వ తేదీన విశాలాంధ్ర మహాసభ స్థాపింపబడినప్పుడు వారి ఆశీర్వచనములు వచ్చినవి. 1950 వ సంవత్సరములో వరంగల్లులో జరిగిన కన్వెన్షన్స్‌కు వారు దయచేశారు.

అప్పటినుంచి ఆంధ్ర రాష్ట్రములో మాత్రము ఏకగ్రీవముగా ఎట్టి అభిప్రాయ భేదములేకుండా వచ్చినది అయితే, తెలంగాణాలో మాత్రము కొంచెము అభిప్రాయ భేదము ఉన్నమాట నిజమే. కాని ఒక్క మాట మాత్రము చెప్పకతప్పదు. కమ్యూనిస్టు పార్టీవారు తెలంగాణాలోను, ఆంధ్ర రాష్ట్రములో కూడా విశాలాంధ్ర విషయములో ఏకాభిప్రాయముతో ఉన్నారు. ఆఖరు రోజులలో ఆంధ్రదేశము మేల్కోలేదు. వారిదగ్గర నుంచి టెలిగ్రాములు రాలేదేమి; హర్తాళులు జరగలేదేమి; అని మాకు ఢిల్లీనుంచి ఒక సందేశం వచ్చింది. వెంటనే ఎనిమిదివేల టెలిగ్రాములు పంపాము, మూడువందల హర్తాళులు చేశాము. ఈ విషయములలో కమ్యూనిస్టు పార్టీవారు నాతో చాలా సహకరించి, కూడా ఉండి ప్రతిచోటా పనిచేశారు. బహుజాగ్రత్తగా ఏ విధమైనటువంటి వైలెన్సు (Violence) లేకుండా ఉద్యమము జరుపబట్టే మనకు విశాలాంధ్ర వచ్చింది.

సోషలిస్టుపార్టీవారు, యు.పి.పి.వారు కూడా నన్ను అభినందించారు. శ్రీరామకృష్ణరాజు అభినందించారు. ఆయన ఆంధ్రదేశంలో పేరెన్నికగన్న నాయకులు. వారు, నేను ఎప్పటినుంచో సహచరులుగా ఉన్నాము. ఆయన సంగీత సాహిత్యములు రెండింటిలో కూడా సమాన ప్రతిభగలవారు.

నాట్యము విషయం వదలిపెట్టమన్నారు శ్రీ వెంకట్రావుగారు. శ్రీ రామకృష్ణరాజుగారి యొక్క అభినందనలు నాకు మిక్కిలి విలువగలవని మనవిచేస్తున్నాను. శ్రీ రంగారెడ్డిగారు నన్నభినందించారు. తెలంగాణాలో ఎవరికయినా ఒక వ్యక్తికి గొప్ప ప్రతిష్ట ఉన్నదంటే అది నిజముగా రంగారెడ్డిగారికే. మేము కొన్ని విషయాలలో వ్యతిరేకించుకున్నాము, పోట్లాడుకున్నాము. తిరిగి కలిశాము. నేను కూడా పోయి వారిని బ్రతిమిలాడాను. వారు అంగీకరించారు, చక్కగావచ్చారు, మనకీనాడు నాయకత్వంవహించారు. ఇదొక గొప్ప సంగతి. అన్నిటికన్న గొప్ప విషయము మన ఆంధ్రకేసరి యొక్క ఆశీర్వచనములు. ఆయన ఓపికతోలేచి అంతసేపు మాట్లాడి ఆశీర్వదించారు. దీవెనలు భగవంతుడేయిస్తాడు. అయితే ఇటువంటి పెద్దలయొక్క, ధీరులయొక్క, దేశనాయకులయొక్క ఉత్తమ పురుషుల యొక్క ఆశీర్వచనములు భగవదాశీర్వచనముల తరువాత అంత ముఖ్యమయినవి. వారి క్రింద నేను అనేక సంవత్సరములుగా పనిచేశాను. వారు ఎన్ని సంవత్సరములు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా ఉన్నారో నేను అన్ని సంవత్సరములు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కమిటీకి జనరల్ సెక్రటరీగా ఉన్నాను. మేమిద్దరము

ఎన్నో సంవత్సరములు కలిసి పనిచేశాము. సంఘ సంస్కరణల విషయములో కూడ కలిసి పనిచేశాము. వారు ఇంగ్లండు నుంచి 1907వ సంవత్సరంలో వచ్చినప్పుడు వారితో కలిసి భోజనంచేశామని మమ్ములను వెలివేశారు. అయితే, మేము లెక్కలేదు, పొమ్మన్నాము. అన్నిటిలో కూడ వారు మనలను నడిపినటువంటివారు. వారియొక్క దీవెనలు, అభినందనలు, ఆశీర్వచనములు చాలా ముఖ్యమయినటువంటివి.

శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పినట్లు ఏదో భాషాసేవకూడా కొంత నేను చేసినమాట వాస్తవమే. 1907వ సంవత్సరములో విజ్ఞాన చంద్రికామండలి పెట్టాము. ఎప్పుడైతే స్వరాజ్యము కావలెనని అన్నామో దానితోబాటు సంఘసంస్కరణ తప్పదు; దానితోబాటు హరిజనోద్ధరణ తప్పదు. కోట్లకొలది జనులను ప్రత్యేకముగా వుంచితే ఎట్టి స్వరాజ్యం వస్తుంది; ఎట్లా వస్తుంది; వస్తే ఎట్లా నిలుస్తుంది; అనేటటువంటిది అప్పుడుకూడా అనుకున్నటువంటిదే. అందువల్ల నేను నా మిత్రులు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలయినవారంతా కలసి నవీన విజ్ఞానాన్ని ఆంధ్రప్రజానీకానికి అందిద్దామని ప్రయత్నం చేశాము. నేను కూడా ఉడతా భక్తితో కొద్దిగా వ్రాశాను. జైళ్ళలో కూర్చొని వ్రాసుకుంటూ ఉండేవారము. నేనూ, గోపాలరెడ్డిగారు కూర్చొని చదువుకుంటూ వుండేవారము. ప్రపంచములోని కాన్‌స్టిట్యూషన్సును చదివాము. ఇంగ్లాండ్, డొమినయన్స్, యూరపు దేశాలు మొదలయిన వాటికి సంబంధించిన కాన్‌స్టిట్యూషన్స్‌ను, టోటలిటేరియన్ దేశాలయొక్క కాన్‌స్టిట్యూషన్స్‌ను చదివాము. ఏదో కొంత కృషి చేశాము. అది అంతా అయిపోయింది. చివరకు ఈ పదవీ సన్యాసాశ్రమంలో వచ్చిందని శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పారు. నేను ఒప్పుకుంటున్నాను. బహుశః సన్యాసాశ్రమం కాకుండా వానప్రస్థాశ్రమమేమో ఇది. మొత్తమునకు అటువంటిదే ఇది. సందేహం లేదు. నోటికి తాళం వేసుకోవలసి వచ్చింది. నాకు ఎప్పుడూ స్వతంత్రంగా ఉండడం అలవాటు. పార్టీలోకూడా స్వతంత్రంగా ఉంటూ ఉండేటటువంటి పద్ధతే నాది. మినిమమ్ డిసిప్లిన్ (Minimum Discipline) నాది. (నవ్వు) మత ధర్మముగా నేను ఇవన్నీ నిర్వర్తించాను. స్వరాజ్యం వస్తుందని దిగామా ఉద్యమంలోకి? నేను స్వరాజ్యం చూడనేమో, తరువాత ఆంధ్రరాష్ట్రం చూడనేమో అనుకున్నాను. చూడకుండానే శ్రీ వెంకటప్పయ్యగారు పోయినారు. విశాలాంధ్రము కూడా నాకు మత ధర్మమే. అందువల్ల కొందరు వ్యతిరేకించినారని నాకు భయము లేదు. మనము చేతనయినంతా చేస్తాము. వదలి పెట్టి పోతాము. ఇతరులెవరో దానిని సాగిస్తారు.

కాని, ఈ అదృష్ట మేమిటంటే ఈ మూడు విషయాలు మనం చూశాము. నేను బ్రతికి వుండి విశాలాంధ్ర చూడడం, స్థాపించడం, తరువాత మీరంతా కలసి నన్ను తీసుకుని వచ్చి ఈ కుర్చీమీద కూర్చో పెట్టడం, ఇదంతా కూడ నాకు చాలా గొప్ప విషయం. నా జన్మ ధన్యమయింది. ఈ అత్మకు ముసలితనం లేదు. అది నా నమ్మకం, అత్మకు ముసలి తనమూ లేదు. మరణము లేదు. అందువల్ల ఈ శరీరము కృశించి పోయినప్పటికి మనస్సు నిరుత్సాహపడటం తప్పు. ఎప్పుడూ కూడా కొత్త విషయాలు మనం గ్రహించుతూ వుండాలి. ఇది నా నమ్మకములలో మరొకటి. రిసెప్టివ్ మైండ్ (Receiptive mind) తో ఉండాలి. ఓపెన్ మైండ్ (Open mind) తో ఉండాలి. వెనుకబడి ఎక్కడో ఒకచోట ఫుల్‌స్టాప్ పెట్టుకొని ఉండకూడదు. ఇది కూడా నా నమ్మకం. గ్లాడ్‌స్టన్ దగ్గరనుంచీ నేను నేర్చుకున్నది స్టూడెంట్ ఇన్ లైఫ్ (Student in life) అనే విషయం. ఎప్పుడూ నేను పుస్తకాలు చదువుతూనే వుంటాను. నాకది అలవాటు. ఇందుకు భగవంతుడు నాకు శక్తి ఇచ్చుగాక అని కోరుతున్నాను.

ఇక నా పార్లమెంటరీ జీవితం విషయం ఉన్నది. 1916వ సంవత్సరం నుంచి కాంగ్రెస్ వారు శాసనసభలకు అభ్యర్థులను నిలిపినప్పుడల్లా నన్ను నిలుపుతూనే వచ్చారు. 1916లో పార్లమెంటరీ యాక్టివిటీస్‌తో సంబంధం పెట్టుకున్నప్పుడు నన్ను మద్రాసు కౌన్సిలుకు నిలబెట్టారు. తిరిగి 1937లో నన్ను మద్రాస్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి నెలబెట్టారు. అప్పుడు మంత్రిపదవి ఇవ్వటానికి వీలులేక రాజగోపాలాచారిగారు చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా నాకు చాలా తరిఫీదు ఇచ్చారు. ఆ సమయంలో నా మిత్రులు అయినటువంటి హిందూ పత్రిక ఎడిటరుగారు స్పీకర్‌షిప్ ఇవ్వండి కాళేశ్వరరావుగారికి అని చెప్పారు. కాని, స్పీకరుషిప్ ఇస్తే పార్లమెంటరీ యాక్టివిటీస్‌నుంచి పోతాడు. అతను స్వాభావికంగా పార్లమెంటేరియన్ కాబట్టి స్పీకర్‌షిప్ ఇవ్వనన్నారు ఆయన. అప్పుడు స్పీకర్‌షిప్ నాకు తేలికగా వచ్చేది. కాని ఆయన ఒప్పుకోలేదు. నేను కూడా సరే అన్నాను. స్పీకర్ షిప్ లేనప్పుడు, మంత్రిపదవి లేనప్పుడు చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా ఉండి వారి క్రింద చాలా తరిఫీదు పొందాను. శ్రీ గోపాలరెడ్డిగారు అప్పుడు మంత్రిగా ఉన్నారు. అంతాకలసి ఒక కుటుంబముగా పని చేసుకున్న రోజులవి. కాని, ఇప్పుడు ఒప్పుకున్నాను, స్పీకర్ పదవికి, ఏదో పెద్దవాడను అవుతున్నాను పోనీ అని.

మనము ముఖ్యంగా సోషలిస్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటిని నిర్మించు కోవలసి ఉంది. ఆ పనిలో తోడ్పడవచ్చును. భావాలు ఇవ్వవచ్చును. కేవలం యాక్టివ్ ఎలక్షన్ పోలటిక్సులో, కాంగ్రెస్ కమిటీలలో ఉండనక్కరలేదు. కాని, తక్కిన విషయాలలో పాల్గొనవచ్చు. గాంధేయ పద్ధతులలో సోషలిస్టిక్ ఆర్డర్ ఆఫ్ సొసైటి మనకు రావలెనని ప్రయత్నం చేసే విషయంలో కూడా నేను యాక్టివ్ పార్టు తీసుకొనవలెనని నా ఆశ.

ఇక్కడ కూడా సోషలిస్టిక్ ఆర్డర్ ఆఫ్ సొసైటిని మీరు తీసుకుని రావాలి. ఈ శాసనసభ అందుకే. ఆ ఆదర్శంకోసమే మనము శాసనములను సృష్టించుకోవాలి. మంత్రులు అందుకు పనిచేయవలె. శాసనసభ్యులు అందుకు పనిచేయవలె. కాబట్టి మనము ప్రోగ్రెసివ్ లెజిస్లేషన్ చాలా చేసుకొనవలసి ఉంది. దానిలో నేను మీకు తోడ్పడుతాను.

గోపాలరెడ్డిగారు చెప్పినట్లు, ఇంతకుముందు మహామహులంతా సభాధ్యక్షులుగా ఉండినారు. చింతలవాడి నరసింహారావుగారు మొదట అధ్యక్షులుగా ఉండినారు. తరువాత మహర్షి సాంబమూర్తిగారు ఉండినారు. తరువాత శివషణ్ముగం పిళ్ళైగారు ఉండినారు. తరువాత నల్లపాటి వెంకటరామయ్యగారు ఉండినారు. నేను వారి time లో లేననుకోండి. తరువాత రొక్కం లక్ష్మీనరసింహం దొరగారు ఉన్నారు. వైద్యగారిని గురించి కూడ నేను చాలా విన్నాను. వారు సుప్రసిద్ధ న్యాయవాదులు, వారు అనేక సంవత్సరాలనుంచి కాంగ్రెసులో ఉన్నటువంటి వారు, వారు బహుజాగ్రత్తగా బహు గౌరవంగా ఈ హైదరాబాదు శాసనసభను నడిపించారని విన్నాను. వీరందరి తరువాత నేను వచ్చాను. వారియొక్క Traditions, పరంపరానుగతమైన పద్ధతులను నేను కూడ అనుసరిస్తానని వాగ్దానం చేస్తున్నాను. బ్రిటీష్ పార్లమెంటుయొక్క పద్ధతులు చాలా మంచివి. ఎందుకంటే వాళ్ళది Mother of Parliament అని చెప్పబడుతున్నది. వాళ్ళు ఆ పద్ధతినంత బహుజాగ్రత్తగా తీసుకు వచ్చారు. వాళ్ళు సామ్రాజ్య వాదులైనా, వాళ్ళ దేశాన్ని మాత్రం చాల జాగ్రత్తగా democratic గా కాపాడుకొంటూ వచ్చారు. కాబట్టి మనము ఆ విధంగా democratic గా పోవలసియుంటుంది. ఈ కుటుంబానికి నన్ను పెద్దగా ఎన్నుకొన్నారు కనుక సభ్యులందరి యొక్క గౌరవాన్ని, హక్కులను కాపాడటమే నా విధి. అప్పుడప్పుడు అభిప్రాయ భేదాలు ఉంటే ఉండవచ్చు. Freedom of speech, freedom of writing, freedom of press ఇవన్నీ వుంటాయి. వారి వారి అభిప్రాయాల ప్రకారం ఉపన్యాసాలు

ఇచ్చుకోవచ్చు. విమర్శలు చేసుకోవచ్చు. కాని ఏది జరిగినా ఎప్పుడూ సౌజన్యంతో జరగాలి. విమర్శలు చేసుకొన్నా కఠినంగా మాట్లాడకుండా చేసుకోవలసియుంటుంది. అయితే పార్టీ భేదం లేకుండా అందరి హక్కులను సంరక్షించి, హిందూదేశంలో ఒక గౌరవప్రదమైనటువంటి ప్రతిష్టతో కూడినటువంటి శాసనసభను ఈ ఆంధ్రప్రదేశ్‌లో నిర్మించుకోడానికి నా యొక్క శక్తినంతా వినియోగిస్తానని నేను గట్టిగా మనవి చేస్తున్నాను. ఆంధ్రప్రదేశ్ వచ్చింది. ఇప్పుడు 3.10 లక్షల ఆంధ్రులతో కూడిన అఖండమైన, అవిచ్ఛిన్నమైన ఆంధ్రప్రదేశము ఏర్పడింది. మొత్తం 3.50 లక్షలుగల ఆంధ్ర ప్రజానీకం బ్రిటీష్ సామ్రాజ్య వాదులచేత అనేక రాష్ట్రాలుగా పంచి పెట్టబడింది. వారినంతా ఇప్పుడు ఏకము చేయడానికి ప్రయత్నం చేస్తున్నాము. ఇప్పుడు 3.10 లక్షల ఆంధ్రులతో కూడిన విశాలాంధ్రను సాధించుకొన్నాము. ఇందాక ప్రకాశంగారు శలవిచ్చినట్లు ఇంకా మనకు రావలసినటువంటి భాగాలు వున్నాయి. ఛాందా జిల్లాలో కొంత భాగము రావలసి యున్నది. అట్లాగే ఇతర రాష్ట్రాలలో నుంచి కొన్ని భాగాలు రావలసి యున్నవి. ప్రభుత్వం వారూ మీరందరూ సామరస్యంగా, negotiations ద్వారా zonal councils ద్వారా శాంతియుతమైనటు వంటి ఆందోళనద్వారా అవన్నీ రాబట్టడానికి ప్రయత్నం చేయవలసి యుంటుంది. నేను మీకు పైన వుండి ఆశీర్వదిస్తూ వుంటాను. దాంట్లో నా సహాయం, నా పలుకుబడి ఏదైనా కావలసియుంటే తప్పక ఆ విధంగా చేస్తాను.

తరువాత, minorities యొక్క వెనుకబడిన ప్రాంతాల యొక్క రక్షణ చాల ముఖ్యమైనటువంటిది. తెలంగాణాలో మనం కలసినామనేది నేను ఒప్పుకొంటున్నాను. విశాలాంధ్ర ఆఖరు రాజధాని హైదరాబాద్. నైజాంముల్ ముల్క్‌కు అఖండమైన అవిచ్ఛిన్నమైన ఆఖరు రాజధాని హైదరాబాదే. తరువాత బ్రిటిష్ సామ్రాజ్య వాదులు దేశాన్ని పంచి పెట్టారు. ఇప్పుడు మనము మరల వెనుకకు పోయి హైదరాబాదు రాజధానికి వచ్చాము. కనుక మనము హైదరాబాదులో చేరాము గాని మనలో వారు చేరిందనేదేమిలేదని నా అభిప్రాయం. కాబట్టి ఇప్పుడు హైదరాబాదు రాజధానిగా వున్నటువంటి ఆంధ్రదేశము ఏర్పడింది. ఇంక తెలంగాణా కొన్ని విషయాలలో వెనుకబడి వున్నదని వారికి కొన్ని safeguards, రక్షణలు ఏర్పాటు చేశారు. ఆ రక్షణలను మనము గట్టిగా నిలబెట్టి అమలు జరుపవలెనని కోరుతున్నాను. తరువాత, ఉర్దు, కన్నడ, మహారాష్ట్ర

ఇవి minority భాషలుగా ఇక్కడ వున్నాయి. మాతృభాషలకు ప్రత్యేకమైన సంరక్షణ ఇవ్వాలని ఇప్పుడు వచ్చినటువంటి Act లో ఉన్నది. ఆ విధంగా చేయవలసిన బాధ్యత మీపైన ఉన్నది. ఆ విషయంలో మీకు మద్దతు ఇస్తూ వుంటాను. మనము తెలుగును రాష్ట్ర భాషగా ఏర్పాటు చేసుకొంటున్నాము. కాబట్టి తెలుగుకు ప్రధాన స్థానం ఇవ్వక తప్పదని నా ఉద్దేశ్యము. రెండవ స్థానం ఉర్దూ భాషకు ఇవ్వలసి యుంటుంది. ఇక్కడ Muslims పెద్ద minority గా ఉన్నారు, కాబట్టి ఉర్దూ భాషకు ఇక్కడ ప్రధాన స్థానమున్నది. మూడవస్థానం ఇంగ్లీషు ఆక్రమించుకోవాలి. ఇంగ్లీషు 10, 15 ఏళ్ళలో పోయేటటువంటిది కాబట్టి, అది క్షీణ చంద్రునివంటిది. కనుక దానిపట్ల మనము ఎక్కువ శ్రద్ధ చూపనవసరం లేదు.

మీరు ఈ సభాధ్యక్ష స్థానాన్ని నాకు ఇచ్చి నన్ను గౌరవించినందుకు మీకు నా కృతజ్ఞత తెలియజేస్తున్నాను.



**శ్రీ బి.వి. సుబ్బా రెడ్డి**

20-03-1962 నుండి 29-09-1971

# శ్రీ బి. వి. సుబ్బారెడ్డి

శ్రీ బి.వి. సుబ్బారెడ్డి మూడవ శాసనసభ (1962-1967) స్పీకరుగా 1962 సంవత్సరము మార్చి 20వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1967వ సంవత్సరము మార్చి 14వ తేదీ వరకు, నాల్గవ శాసనసభ (1967-1972) స్పీకరుగా 1967వ సంవత్సరము మార్చి 20వ తేదీ నుండి 1970వ సంవత్సరము జూలై 31వ తేదీ వరకు మరియు 1970వ సంవత్సరము డిసెంబరు 3వ తేదీ నుండి 1971వ సంవత్సరము సెప్టెంబరు 29వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1903వ సంవత్సరం జూలై ఒకటవ తేదీన కర్నూలు జిల్లా కోయిలకుంట్లలో జన్మించారు. వీరు బి.ఎ., బి.ఎల్. చదువుకున్నారు. 1938 మరియు 1949వ సంవత్సరములలో కర్నూలు జిల్లా బోర్డు అధ్యక్షునిగా పనిచేశారు. వీరు దేశ స్వాతంత్ర్యం కొరకు వివిధ దశలలో జరిగిన పలు ఉద్యమాలలో పాల్గొని అనేకసార్లు జైలు శిక్షను అనుభవించారు.

శ్రీ బి.వి. సుబ్బారెడ్డి 1955వ సంవత్సరములో రెండవ శాసనసభకు, 1962వ సంవత్సరములో మూడవ శాసనసభకు, 1967వ సంవత్సరములో నాల్గవ శాసనసభకు, 1972వ సంవత్సరములో ఐదవ శాసనసభకు వరుసగా కర్నూలు జిల్లా కోయిలకుంట్ల నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. శ్రీ సుబ్బారెడ్డిగారు 1962, 1972వ సంవత్సరాలలో శాసనసభకు ఏకగ్రీవంగా ఎన్నికై చరిత్ర సృష్టించారు.

రాష్ట్ర శాసనసభ స్పీకరుగా కడుసమర్థతతో పనిచేసి, ఎటువంటి క్లిష్ట పరిస్థితులలోను పార్లమెంటరీ సంప్రదాయలకు భంగం వాటిల్లకుండా సభను నడిపించిన ఘనత శ్రీ సుబ్బా రెడ్డిది.

శ్రీ పి.వి. నరసింహారావు మంత్రి వర్గంలో శ్రీ సుబ్బారెడ్డి 30-09-1971 నుండి 20-03-1972 వరకు ఉప ముఖ్యమంత్రిగా, ప్రణాళిక, ప్రజా పనుల శాఖలను నిర్వహించారు. 1972 ఎన్నికల అనంతరం తిరిగి శ్రీ పి.వి. నరసింహారావు మంత్రి వర్గంలో 20-03-1972 నుండి 30-12-1972లో రాజీనామా చేసే వరకు ఉపముఖ్యమంత్రిగా,

ప్రణాళిక, రోడ్లు, భవనాలు, రహదార్లు, ఉద్యానవనాలు, ప్రజాపనుల శాఖలను నిర్వహించారు. శ్రీ జలగం వెంగళరావు మంత్రి వర్గంలో 10-12-1973 నుండి 08-06-1974 వరకు ఉపముఖ్యమంత్రిగా పనిచేసి ప్రణాళిక, వ్యవసాయ శాఖలను నిర్వహించారు.

1965వ సంవత్సరములో వీరు సోవియట్ యూనియన్‌ను సందర్శించారు. 1968వ సంవత్సరములో బహమాస్ ఐలాండ్ నస్సావ్‌లో జరిగిన కామన్‌వెల్త్ పార్లమెంటరీ సదస్సులో పాల్గొన్నారు. తిరిగి 1970వ సంవత్సరములో లండన్‌లో జరిగిన కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ సదస్సులో కూడా పాల్గొన్నారు.

శాసనసభా కార్యక్రమాల నిర్వహణలో అత్యున్నత సాంప్రదాయాలను నెలకొల్పిన శ్రీ బి.వి. సుబ్బారెడ్డి అందరికీ ఆదర్శప్రాయుడు. స్పీకరుగా సభా గౌరవాన్ని పెంపొందించుటకు, సభ్యుల హక్కుల పరిరక్షణకు వీరు విశిష్టమైన కృషి చేశారు. చట్టసభల కార్యకలాపాలలో పాల్గొనే సభ్యులకు న్యాయస్థానాలతో సహా ఎవరూ ఎటువంటి ఆటంకాలు కల్పించరాదని, శాసనసభ్యులు శాసనసభ సమావేశాలకు హాజరుగుటను అత్యంత ప్రాధాన్యత గల విషయముగా అందరూ పరిగణించాలనే విషయాన్ని 1963వ సంవత్సరము మార్చి 22వ తేదీన ఇచ్చిన రూలింగులో నొక్కి వక్కాణించారు. శాసనసభ సమావేశ కాలంలో ఎవరైనా సభ్యునకు శాసనసభ ఆవరణలో సమన్లు జారీ చేయడం లేదా స్పీకరు ద్వారా గాని శాసనమండలి అధికారుల ద్వారా గాని అట్టి సమన్లను సభ్యులకు అందజేయ వలసిందిగా కోరడం గాని సభాధిక్కారం క్రిందకే వస్తుందని ఆ రూలింగులో సుబ్బారెడ్డి గారు స్పష్టం చేసారు.

శాసనసభాపతి స్థానానికే వన్నె తెచ్చిన శ్రీ బి.వి. సుబ్బారెడ్డి 1974వ సంవత్సరము జూన్ 8వ తేదీన మరణించారు.

# శ్రీ బి.వి. సుబ్బారెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంలో చేసిన ప్రసంగం

Hon'ble Leader of the House, Hon'ble Leaders of the Opposition Parties and Hon'ble Members of the House :

You will all kindly pardon me if I address you in a foreign language and not in our own mother tongue. I would certainly try to forget English language as far as possible during the course and try to carry on in Telugu itself. But, for the time being, I am not prepared to speak in Telugu, and with your permission, I proceed to speak in English.

Various Hon'ble Members of this House have spoken various things, complimenting me in a number of ways. I do not know how far I deserve these compliments. It is true that in my own humble way I did service to our country, and I will continue to do so in future also. However, whether I deserve these compliments or not, I will certainly strive hard to enhance the reputation of this House and keep up the dignity of this House and try to fulfil the expectations expressed by various Hon'ble Members.

It is true that on occupying this Chair I cease to be a member of the party to which I have the great privilege of belonging. But I assure you all that I will not forsake the cardinal principles for which that party stands, namely, truth and justice. I will try, so long as I occupy this Chair, to uphold all those principles. The role I have undertaken is a very responsible and onerous one, I realise. I do not know how far I will be able to acquit myself so as to enhance the reputation of this House. But if all the Hon'ble members of this House extend to me their hearty co-operation and good will, I am confident that I will be able to discharge my duties successfully and efficiently.

The various predecessors who occupied this Chair were really eminent men, capable men. They had set up very good traditions; and for my part, I will certainly keep up all those traditions and, if possible, improve on them and try also to establish new traditions for future generations to follow.

Here I will be failing in my duty if I do not refer to the services rendered by the late Sri A. Kaleswara Rao who was my immediate predecessor. As you all know, he was a great and good man, with a cool head and a warm and large heart. He was one of the architects of this State and the first to occupty this Chair after the State of Andhra Pradesh was formed. He was a very good scholar in Telugu and an eminent lawyer during the days when he practised at the Bar, who could unravel any intricate points with clarity of thought. He had a noble bearing of his own. At times, by his witty statements he would make everybody laugh in the House; and, as most of you who were members of the previous Assembly were aware, he would wind up a heated and stormy debate with a cript statement and with a loud and hearty laughter,- a laughter which opened his lips as also his heart. There was not a single unpleasant occasion as far as I know; and I must say that he had discharged his duties very conscientiously and very efficiently. He had the good fortune to have to hearty co-operation and good will of all the Hon'ble Members of the House. It is very unfortunate that this venerable old gentleman passed away. It is certainly a great loss to us; but one consolation is that he died full of honours and glory.

I would only appeal to you to extend to me the same kind and hearty co-opeation and good will and make my task less difficult in discharging my duties.

So far as the composition of this House is concerned, it is not much different from that of the previous one except that the number of the ruling party has gone down and the number of the Opposition Parties has gone up.

With the addition in the Opposition parties, not only they are vying in strength, but I must observe that they have also gone up in quality, particulary with the addition of Tarimela and Tenneti-please excuse me if I do not mention their names. As I look round from one side to another of the House, I find a number of young men with bright and blooming faces with sprinkle of a few old and experienced people also. Only let me hope that these young men will not prove to be very boisterous and uncontrollable.

So far as the Congress Party is concerned with an eminent and stalwart statesman and able administrator Sri Sanjiva Reddy as its leader who contributed not a little for the development of the State, I am sure the Congress Party will effectively face and tackle the Opposition and make headway for allround improvement of the State. I expect very lively and interesting debates in this House in future. I hate dullness and monotony in any form anywhere. I expect every Hon'ble Member of this House to be alert and put life and spirit in the debates and dileberations of this House, for, otherwise, the proceedings would be very dull and drab. I expect to witness scenes such as those between Lord Sri Krishna and the Hero Arjuna in Gayopakhyanam. I know that often Sri Sundarayya, an experienced and able debator and parliamentarian, will raise many interesting points for decision, and in his own inimitable cool, calculatd and inoffensive way, try to convince us. He is a gentleman, who is perhaps doing more for his party than any body else. So far as Mr. T. Viswanatham is concerned, he is a leader follower, a giant who needs no followers to fight his battle. Perhaps, in my opinion, it is better to fight single-handed than fight with an indisciplined army. So far as the Swatantra party is concerned Sri Latchanna, the leader of the party, is a very capable and experienced politician and debator. The members of this party attach great importance to moral values and in the performance of Dharma. I am sure they will acquit themselves very honourably and successfully. So far as the Independent members are concerned, they will kindly excuse me if I observe that I consider them as

an assortment of odd elements and it would be better if they can so fuse themselves together as to form a compact and well-knit group. So far as Vavilala is concerned, I do not know at present to which party he belongs, but I know that with his fund of information and knowledge he will not certainly give me any respite, and give me and also the Ruling party any amount of trouble; but I consider him not only as a valuable asset to this House but to any House that he may be asked to be present. Many Hon'ble Members are strangers to me and I am also a stranger to many of them. But let us all try to acquaint ourselves with one another, and more than that, let use try to understand each other, for I consider that the root cause for the many calamities in this world has been the failure to understand each other.

I should certainly be polite and courteous to every Hon'ble Member of this House and try to earn their goodwill and esteem; but at the same time I must tell you that I will be firm and stern in discharging my duties. All the Hon'ble members will certainly have freedom of speech consistent with the code of conduct and discipline. It would be better for them so far as freedom of action is concerned to restrict it to the minimum extent possible. I should certainly very zealously and scrupulously try to safeguard the rights and privileges of the Hon'ble Members.

So far as Hon'ble Lady Members are concerned, I will be failing in my duty if I do not say a few words about them. They, by their presence, not only add to the beauty and colour and dignity of the House, but I am sure that by their wise counsels and their practical suggestions they would contribute towards the development of the State. I will certainly be very chivalrous to them and I expect other Hon'ble Members of the House to be chivalrous to them. I for my part would try to discover and recognise worth wherever it is;- not only discover it but value it, and see that it shines. There is nobody here who is not inspired by zeal to contribute something towards

the development of this State. I would only appeal to all the Hon'ble Members to so conduct themselves as to enhance the prestige and dignity of this House.

Let those who watch the proceedings of this House go away with the impression that the proceedings of the House are carried on in a high and dignified manner. It shall give me supreme satisfaction, if, at the end of the term, we go away with the feeling that every one of us has discharged his duties honestly and sincerely. I appeal to every Hon'ble member to act his part well and add to the glory and dignity and reputation of the House.

Various Hon'ble Members of this House have put forward various suggestions. I will certainly bear them in mind and try to see that justice is done. I will be fair and just in all my dealings with the Hon'ble Members of this House.

Thank you all, gentlemen.



**శ్రీ కె.వి. వేమా రెడ్డి**

25-11-1971 నుండి 19-03-1972

# శ్రీ కె.వి. వేమారెడ్డి

శ్రీ వేమా రెడ్డి నాల్గవ శాసనసభ (1967-1972) స్పీకరుగా 1971వ సంవత్సరము నవంబరు 25వ తేదీన ఎన్నికై 1972వ సంవత్సరము మార్చి 19వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు చిత్తూరు జిల్లా మదనపల్లిలోని థియోసోఫికల్ కాలేజీలో విద్యాభ్యాసం చేసారు. మద్రాసు లా కాలేజీ నుండి ఎల్.ఎల్.బి. పట్టా పుచ్చుకొని న్యాయవాది వృత్తిని స్వీకరించి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా చాలా కాలం పనిచేశారు. అనంతపురం జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా పనిచేసి ప్రజలందరి మన్ననలను పొందారు. వీరు రాయలసీమ డెవలప్‌మెంట్ బోర్డు అధ్యక్షునిగా, సెంట్రల్ బ్యాంకు అధ్యక్ష్యునిగా, డిస్ట్రిక్ట్ బోర్డు అధ్యక్షునిగా పనిచేసారు.

వీరు 1952వ సంవత్సరములో అనంతపురం జిల్లా కదిరి నియోజకవర్గం నుంచి ఉమ్మడి మద్రాసు శాసనసభకు ఎన్నికైనారు. 1955వ సంవత్సరములో రెండవ శాసనసభకు, 1967వ సంవత్సరములో నాల్గవ శాసనసభకు కదిరి నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. శ్రీ వేమా రెడ్డి 1967-1968, 1968-1969 సంవత్సరాలలో అనుగత చట్ట నిర్మాణ కమిటీ అధ్యక్షునిగాను, 1970-1971, 1971-1972 సంవత్సరాలలో అంచనాల కమిటీ అధ్యక్షునిగాను పనిచేశారు.

అజాత శత్రువుగా, ఉత్తమ ప్రజాసేవకునిగా, న్యాయకోవిదునిగా పేరుగాంచిన శ్రీ వేమా రెడ్డి హుందాగా, విజ్ఞతతో వ్యవహరించి అందరికి ఆదర్శ ప్రాయమైన పద్ధతిలో శాసనసభాకార్యక్రమాలను నడిపించి సమర్థులైన స్పీకరుగా పేరు తెచ్చుకున్నారు. శాసనసభ గౌరవం, మర్యాదలకు ఎటువంటి భంగం వాటిల్లకుండా వీరు శాసనసభా కార్యకలాపాలను ఎంతో సమర్థవంతంగా నిర్వహించారు. దురుద్దేశంతో, శాసనసభ ప్రతిష్ఠను దిగజార్చాలనే లక్ష్యంతో ఎవరైనా వ్యవహరించినట్లయితే అది సభా ఉల్లంఘన క్రిందకు వస్తుందని శ్రీ వేమారెడ్డి 1971 సంవత్సరము డిసెంబరు 2వ తేదీన ఇచ్చిన రూలింగులో తెలియజేశారు.

శ్రీ వేమా రెడ్డి 1989వ సంవత్సరము జనవరి ఒకటవ తేదీన మరణించారు.

## శ్రీ కె.వి. వేమా రెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంలో చేసిన ప్రసంగం

Hon'ble Chief Minister and the Leader of the House, Hon'ble Deputy Chief Minister, Hon'ble Minister Mr. Basi Reddy, Hon'ble Minister Mr. Gopala Naidu, Hon'ble Minister Mr. Challa Subba Rayudu, the Leader of the Swatantra Party group, the Leader of the Communist Party group, Sri Gopalakrishnayya and other leaders.

At the outset, I have to express my sense of gratitude for the honour extended to me in electing me as the Speaker of this august House and the very appreciative references made about me which I really do not deserve. I feel like that, but I receive them with great affection and with great sincerity of purpose. As a matter of fact, I believe in destiny. It is God's will and the desire of all friends that I should shoulder the responsibility attached to this high office which was adorned by great distinguished presonalities like Sri Kaleswara Rao, Sri Sambamoorthy and even our revered Deputy Chief Minister, Sri Subba Reddy.

You know, Sir, I was a lawyer, but though a lawyer I never concentrated myself in practice because mostly I dedicated myself to the service of the people and in other spheres of activities and it was only accidentally that I became a Public Prosecutor. So, with all the experience I could derive from these positions, I assure you, Sir, that I shall discharge my duties to the satisfaction of all Hon'ble members and in an impartial manner. I also wish to assure you that those traditions and conventions built up by my predecessors will be maintained and upheld and I will be very impartial in my attitude towards the Hon'ble members of this House. But still may I say that the regard for rule of law, the integrity and good behaviour in the conduct of business by Hon'ble members will go a long way in the successful working of democracy and with your co-operation I shall endeavour to discharge my duties in an impartial manner.

Thank you.



**శ్రీ పిడతల రంగా రెడ్డి**

21-03-1972 నుండి 25-09-1974

# శ్రీ పిడతల రంగారెడ్డి

శ్రీ పిడతల రంగారెడ్డి ఐదవ శాసనసభ (1972 - 1978) స్పీకరుగా 1972వ సంవత్సరము మార్చి 21వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1974వ సంవత్సరము సెప్టెంబరు 25వ తేదీ వరకు అ పదవిని నిర్వహించారు.

వీరు 1917వ సంవత్సరము సెప్టెంబరు 10వ తేదీన ప్రకాశం జిల్లా గిద్దలూరులో జన్మించారు.

శ్రీ రంగారెడ్డి 1940లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని 500 రూపాయలు జరిమాన చెల్లించటంతోపాటు ఒక సంవత్సరము జైలు శిక్షను కూడా అనుభవించారు. 1942వ సంవత్సరములో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1950వ సంవత్సరములో మద్రాసు శాసనసభ నుండి ప్రొవెన్షియల్ పార్లమెంట్‌కు ఎన్నికైనారు.

వీరు 1952వ సంవత్సరములో ఉమ్మడి మద్రాసు శాసనసభకు నేటి ప్రకాశం జిల్లా కంభం నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. 1955వ సంవత్సరములో గిద్దలూరు నియోజకవర్గం నుండి ఆంధ్ర శాసనసభకు శాసనసభ్యుడిగా ఎన్నికైనారు.

వీరు శ్రీ దామోదరం సంజీవయ్య మంత్రివర్గంలో 1960వ సంవత్సరం జనవరి 11వ తేదీ నుండి 1962వ సంవత్సరం మార్చి 11వ తేదీ వరకు ప్రణాళిక అభివృద్ధి, పంచాయతీరాజ్, సమాచార, ప్రచారం, పర్యాటక శాఖమంత్రిగా పనిచేసారు. ప్రణాళిక శాఖా మంత్రిగా ఆయన చేపట్టిన కార్యక్రమాలు, ఆ శాఖను ఆయన నడిపించిన తీరు తెన్నులు జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు పొంది ఆంధ్రప్రదేశ్ గౌరవ ప్రతిష్టలను ఇనుమడింప చేసాయి.

1968వ సంవత్సరములో స్థానిక సంస్థల నియోజకవర్గం నుండి విధాన పరిషత్తుకు పోటీ లేకుండా ఎన్నికైన శ్రీ పిడతల రంగారెడ్డి 15.07.1968 నుండి 13.03.1972 వరకు విధాన పరిషత్తు ఛైర్మన్‌గా పనిచేశారు. వీరు విధాన పరిషత్తు ఛైర్మన్‌గా సభాకార్యక్రమాలను నడిపించినతీరు, అవలంభించిన విధానాలు, అన్ని పక్షాల సభ్యుల మన్ననలు, ప్రశంసలను పొందినవి.

1972వ సంవత్సరములో గిద్దలూరు నియోజకవర్గం నుండి ఐదవ శాసనసభకు ఎన్నికైన వీరు 1972-1974 సంవత్సరాల మధ్యకాలంలో స్పీకరుగా పనిచేసి ఆ పదవికి కీర్తి ప్రతిష్ఠలు తీసుకువచ్చారు.

శ్రీ వెంగళరావు మంత్రి వర్గంలో శ్రీ రంగారెడ్డి ఆర్థిక, వాణిజ్య పన్నులు, గృహనిర్మాణం, సినిమాటోగ్రఫీ శాఖల మంత్రిగా పనిచేసారు.

వీరు 1978వ సంవత్సరము ఆరవ శాసనసభకు, 1985వ సంవత్సరము ఎనిమిదవ శాసనసభకు గిద్దలూరు నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. 1985వ సంవత్సరములో వీరు ప్రోటెం స్పీకరుగా బాధ్యతలను నిర్వహించారు.

శాసనసభకు మంత్రి మండలి సమిష్టి బాధ్యత వహించే పేరుతో ఒక మంత్రి తరపున వేరొక మంత్రి సమాధానాలు ఇవ్వడం, ముఖ్యమంత్రి పేరున వున్న సభా కార్యక్రమాన్ని ఇతర మంత్రులు నిర్వహించడం ఒక అలవాటుగా మారకూడదని అనివార్య కారణాల వల్లనో లేదా కొన్ని ప్రత్యేక పరిస్థితుల కారణంగానో ఆ విధంగా చేయాలని పేర్కొంటూ 1974 జనవరి 23వ తేదీన శ్రీ పిడతల రంగారెడ్డి స్పష్టంగా రూలింగు ఇచ్చారు.

వీరు 1969లో ట్రినిడాడ్ అండ్ టుబాగో, 1971లో మాల్వాయ్ దేశాలలో జరిగిన కామన్ వెల్త్ పార్లమెంటరీ సదస్సులలో పాల్గొన్నారు. అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, రష్యా మొదలైన దేశాలలో పర్యటించారు.

విధాన పరిషత్తు ఛైర్మన్‌గా, శాసనసభ స్పీకరుగా ఎంతోమందికి ఆదర్శప్రాయులైన శ్రీ పిడతల రంగారెడ్డి 1991వ సంవత్సరము జూలై ఒకటవ తేదీన మరణించారు.

## శ్రీ పిడతల రంగారెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

గౌరవ సభ్యులారా, మీరందరూ తిరిగి ఎన్నికై యిక్కడకు వచ్చినందులకు, అందులో ప్రత్యేకంగా, తొలిసారిగా వచ్చినవారికి నేను సుస్వాగతం చెబుతున్నాను. అట్లాగే, నేడు మీరెల్లరూ నన్ను సభాధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నందులకు నా హృదయపూర్వకమైన నమస్కారములు చెబుతున్నాను. ఏకగ్రీవంగా ఎన్నిక చేయడమేగాకుండా, మీరందరూ దాదాపు మూడు గంటలకాలం ఎన్నో సలహాలు చెప్పినారు; ఎన్నో సూచనలు చేసినారు, నా పట్ల వ్యక్తిగతంగాకూడ అనేకమైన మంచి మాటలు చెప్పినారు. అట్లాగే ప్రత్యేకంగా, సభానాయకులు - ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రిగారలు, యితర పక్షాలకు చెందిన నాయకులు, ఇంకా అనేక మంది సభ్యులుకూడ నా పట్ల గౌరవ సూచకంగా, ప్రేమపూర్వకంగా చెప్పిన మాటలకు నా నమస్కారములు చెబుతున్నాను. సభాధ్యక్షపదవి ఎంతటి గురుతరమైనటువంటిదో మీ మాటలలో మీరు నాకు తిరిగి జ్ఞాపకం చేసినందుకు కూడ మీకు నా ధన్యవాదాలు. నాకు జ్ఞాపకం చేయడమేగాకుండా, మీరందరూకూడా మీ మీ కార్యకలాపాల నిర్వహణలో యీ గురుతరబాధ్యతలో పాలు పంచుకున్నప్పుడే నేను యీ బాధ్యతను సక్రమంగా నిర్వహించినవాడిని అవుతాను అనే విషయాన్ని నేను తమకు జ్ఞాపకం చేస్తున్నాను. శాసనమండలి అధ్యక్షునిగా నా నిర్వహణగురించి కూడా యిక్కడ కొంత ప్రస్తావన చేయడం జరిగింది. ఆ సభా నిర్వహణలో కూడా నేను ప్రత్యేకంగా చూపించిన - చేసిన గొప్ప కార్యమేమీలేదు. ఆ సభ హుందాతనం కాపాడడంలో నేను చేసిన ప్రయత్నానికి ఆ సభలోవున్న సభ్యులు, సభానాయకులు, ఇతర పక్షాల నాయకులు యిచ్చిన సహకారమే కారణంగానీ నేను ప్రత్యేకంగా చూపించిన నైపుణ్యం ఏమీ లేదని చెబుతున్నాను. శాసనమండలి సభ్యులనుంచీ, ఆ సభ నాయకులనుంచీ నేను శాసనమండలి అధ్యక్షునిగా సెలవు తీసుకొనే అవకాశం లేకపోయింది. ఐనప్పటికీ నేను యీ సమయాన్ని పురస్కరించుకొని, నాకు వారందరూ - ఆ సభలోని నాయకులు, సభ్యులు నాతో సహకరించినందుకు నేను వారికి నా వందనాలు చెబుతున్నాను. నేను ఇప్పుడు మీ అందరి సంపూర్ణమైన సహకారాన్ని కూడా వాంఛిస్తున్నాను, వస్తుందని

ఆశిస్తున్నాను. నా నిర్వహణను సుళువు చేయడానికి, యీ సభాగౌరవాన్ని కాపాడడానికీ మీరంతా నాతో పాలుపంచుకొనిన నాడే నేను యీ కార్యనిర్వహణను జయప్రదంగా చేయగలుగుతాను. ఇంతకు ముందు యీ స్థానాన్ని అలంకరించిన పెద్దలు శ్రీ కాళేశ్వరరావుగారూ, శ్రీ సుబ్బారెడ్డిగారూ, యీ సభకు ముందున్న శ్రీ వేమారెడ్డిగారు అనేక సత్సంప్రదాయాలు నెలకొల్పారు, శాసనమండలిలో పెద్దలు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, శ్రీ బ్రహ్మయ్యగారు నెలకొల్పిన సాంప్రదాయాలు ఉన్నాయి. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని మీ అందరి సహకారంతో నేను నా బాధ్యతను జయప్రదంగా నిర్వహించడానికి ప్రయత్నిస్తానని మాత్రం మీకు విశ్వాసం యిస్తున్నాను.

ఇక్కడ ప్రతిపక్షంలో వున్నవారు ప్రతిపక్షం బలహీనంగా వున్నది. అధికార పక్షంలోని వారు అధిక సంఖ్యలో వున్నారు అనేభావం వెలిబుచ్చారు. దానిపట్ల నేను ప్రత్యేకంగా ప్రతిపక్ష సభ్యులకు విశ్వాసం యిస్తున్నాను. మన కార్యకలాపాలలో వారు చెప్పబోయే విషయాలకు సంపూర్ణమైన అవకాశం ఉంటుందని చెబుతున్నాను. దానిపట్ల ఎవ్వరికీ కూడా సందేహం అక్కరలేదు. అధికార పక్షంలోవున్న సభ్యులకు వారు ఎక్కువ సంఖ్యలో ఉంటారు కాబట్టి కొంత వ్యవధి లేకుండా పోవడంకూడా జరుగుతుంది. అదికూడా మనం మరచిపోరాదు. పైగా యిక్కడ క్రొత్తగా వచ్చిన సభ్యులు ఉన్నారు. అదీగాక, యీనాడు మనదేశంలోనూ, మన రాష్ట్రంలో కూడా జరిగిన ఎన్నికలు శాసనసభల స్వరూపాన్ని ఏ విధంగా మార్పు చేశాయనేది కూడా నేను విస్మరించజాలను. ఇది దృష్టిలో పెట్టుకున్నప్పుడు, మనందరి బాధ్యత, యీ సభా బాధ్యత ఎంత హెచ్చుగా వున్నదనేది కూడా మనస్సులో పెట్టుకొని అందరకూ కూడా వీలున్నంత వరకూ అవకాశమివ్వడానికి నేను ప్రయత్నం చేస్తాననీ, వ్యవధినిబట్టి ఎవ్వరూ కూడ విచారించవలసిన అవసరం ఉండదని నేననుకొంటున్నాను. మన సభా గౌరవాన్ని, హుందాతనాన్ని ఎంతగా పెంచుకుంటే అంతగా మనం మన కార్యక్రమాలు జయప్రదంగా జరుపుకోవచ్చు. అందరికీ నేను నన్ను సంపూర్ణంగా విశ్వాసంలోకి తీసుకోమని చెబుతున్నాను. ఏ ఒక్క సభ్యునికీ కూడా ఇక్కడ జరిగే చర్చలలో తన నియోజకవర్గాన్ని గురించి చెప్పజాలకపోయాననే అనే భావం లేకుండా అవకాశం కల్పించగలుగుతాననే ధైర్యం నాకు ఉన్నదని మనవి చేస్తున్నాను. మనకు రూల్సు ఉన్నాయి. అవి మీరు చేసుకున్న రూల్సు, నన్ను తెచ్చి ఇక్కడ

కూర్చుండబెట్టిన తరువాత, యీ రూల్సుపట్ల, నిబంధనలపట్ల హెచ్చు గౌరవం చూపించవలసిన బాధ్యత మనందరిపైన ఉన్నదనే విషయం మాత్రం నేను జ్ఞాపకం చేస్తున్నాను. ఈ నిబంధనలకులోబడి మనం మన కార్యక్రమాలు జరుపుకుంటాము. నిబంధనలు దాటి నాకు సర్వస్వాతంత్ర్యం ఉన్నదనేది ఎవ్వరూ అనుకోవలసిన అక్కరలేదు. స్వాతంత్ర్యానికి కూడా ఒక్కొక్క సమయంలో పరిమితులు పెట్టుకోవలసి వుంటుంది. మన ఆవేశానికి కూడా హద్దులు పెట్టుకోవలసి వుంటుంది. ఉత్సాహానికి కూడా పరిమితి పెట్టుకోవలసి వుంటుంది. ఇవన్నీ మనం దృష్టిలో పెట్టుకున్నప్పుడు మనం సభాకార్యక్రమాలను చక్కగా జరుపుకోవచ్చు. అందుచేత యిదివరకువున్న సాంప్రదాయాలే కాకుండా ప్రస్తుత పరిస్థితులను కూడా దృష్టిలో పెట్టుకొని చేసుకోవలసివుంటుంది. సమయం, సందర్భం ఏర్పడినప్పుడు మనం రూల్సును కూడా మార్పు చేసుకోవలసిన అవసరంవుంటే చేసుకోవచ్చు. మనందరి అంగీకారంతో, సభానాయకుల అంగీకారంతో, ఇతర పక్షాల నాయకుల అంగీకారంతో క్రొత్తగా యిప్పుడున్న అవసరాలకు తగ్గట్లుగా సత్సాంప్రదాయాలను ఏర్పాటు చేసుకోడానికి ప్రయత్నం చేస్తూకూడా కార్యక్రమం జరుపుకోడానికి నా సంపూర్ణమైన సహకారం ఉంటుందని చెబుతున్నాను. సభలో వ్యవధి వుండక పోయినా, ఇంతమందిలో అన్ని విషయాలూ చర్చించుకోడానికి వీలు లేకపోయినా తిరిగి అన్ని పక్షాలకుచెందిన నాయకులు, సభ్యులందరూకూడా ఒక అవకాశం కల్పించుకొని భవిష్యత్తులో ఏ విధంగా నిర్వర్తించుకోవాలనేది కూడా మనం ఏర్పాటు చేసుకోవచ్చు. దీనిని గురించి ఎవ్వరికీ ఎటువంటి సందేహాలుకూడా మనస్సులో ఉండనక్కరలేదని చెబుతున్నాను. శాసనమండలి అధ్యక్షునిగా అనుభవంతో, యీ సభాకార్యక్రమాలను కూడా నేను ఇందులో లేకపోయినా చూస్తున్న దానినిబట్టి ఉపన్యాసాలు చేయడంలోగానీ, చర్చలు జరపడంలో గానీ ఏ పార్టీకి చెందినవారైనా ఆ ప్రత్యేకమైన విషయంమీద బాగా అధ్యయనంచేసి, క్షుణ్ణంగా సంగతి సందర్భాలు తెలుసుకొని మాట్లాడితే యీ సభాకార్యక్రమాలకు, బయటవున్న ప్రజలకూ ఉపయోగకరంగా వుండేటట్లు చేసుకోవచ్చునని చెబుతున్నాను. కొంతమంది అన్ని విషయాలపైన మాట్లాడాలనే అభిప్రాయంతో ఉండవచ్చు. వారి ఉత్సాహాన్ని మనం హర్షించవచ్చు. కానీ, యీ పరిమితితో కూడిన వ్యవధిలో అన్ని విషయాలూ చర్చచేసుకోవడం సాధ్యం కాకపోవచ్చు. అటువంటి సందర్భాలలో నేను యీ స్థానం నుంచి సలహా యిస్తే మీరంతా ఆ సలహాకు అత్యంత

గౌరవాన్ని చూపించాలని మాత్రమే నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అంతకంటే ప్రత్యేకంగా నేను ఈ సందర్భంలో ప్రస్తావించవలసిన అవసరంలేదు.

తరువాత, శాసనసభ అధ్యక్షులుగా వున్న వారు ఒక పార్టీకి చెంది వుండవచ్చునా, లేకపోయినట్లయితే అధ్యక్షుడైన తర్వాత తమపార్టీని వదలు కోవలసిన అవసరం ఉన్నదా అనేది ఉన్నది. నాకు తెలుసును, యిదివరకు కొంతమంది పెద్దలు అటువంటి సాంప్రదాయాన్ని నెలకొల్పినారు. వారిపట్ల నాకు చాలా గౌరవంవుంది. అట్లాగని అది మంచి సాంప్రదాయం అని చెప్పడంలేదు. అయితే నేడు మన దేశంలో వున్నటువంటి పరిస్థితులలో దేశంలో వున్నటువంటి వివిధ పార్టీలు ఎటువంటి సాంప్రదాయాన్ని నెలకొల్పారో ఎటువంటి పరిస్థితులు నెలకొల్పగలుగుతాం అనేటటువంటి చర్చ చేయడం జరుగుతున్నది. అనేక సందర్భములలో మన దేశంలో ఉన్నటువంటి శాసనసభల, శాసన మండలుల అధ్యక్షులయొక్క సమావేశంలోకూడా యిదే చర్చచేయడం జరిగింది. మధ్యంతర ఎన్నికలకు ముందు కామన్‌వెల్త్ దేశాల నుంచి వచ్చినటువంటి ప్రిసైడింగ్ ఆఫీసర్సుయొక్క సమావేశంలోకూడా యిదే చర్చకు వచ్చింది. వచ్చిన తరువాత నేడు వుండే పరిస్థితులలో యింకా అనేకమైన సంప్రదాయములు ప్రత్యేకంగా సభాధ్యక్షులుగా వుండి లేదా శాసన మండలి అధ్యక్షులుగా వుండి తిరిగి ఎన్నికలు వచ్చినప్పుడు ఈ సభాధ్యక్షులుగాని శాసనమండలి అధ్యక్షులుగాని ఎటువంటి పోటీలేకుండ ప్రతిపక్షముల వారు కూడా సహరించి ఎన్నిక చేసే సాంప్రదాయాన్ని మనం నెలకొల్పగలుగుతామా లేదా అనేటటువంటిది మనస్సులో పెట్టుకున్నప్పుడు అనేక విషయాలను దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఎంత సత్సంప్రదాయమునైనా అనుభవంలో అందరూ ఆచరించడం లేదనేటటువంటి విషయాన్ని మనవిచేస్తున్నాను. కనుక నేను మీరు చేసినటువంటి సూచనపట్ల గౌరవాన్ని వెలిబుచ్చుతూ కూడా నేను మాత్రం మా పార్టీని వదిలి పెట్టదలచు కోలేదు. వదిలిపెట్టవసిన అవసరంగాని అవకాశం గాని లేదని సవినయంగా మనవి చేస్తున్నాను. అయితే అంత మాత్రంచేత, మీరే ఇప్పుడు చెప్పినారు. ప్రతిపక్ష సభ్యులు చెప్పినారు శాసనమండలి సభ్యులుగా ఎంత నిష్పక్షపాతంతో కార్యనిర్వహణ చేసినానో జ్ఞాపకం చేసినారు. కనుక మీరు అందరు కూడా అటువంటి విశ్వాసాన్ని ఉంచండి. నేను తప్పకుండా మీరు అనుకున్న విధముగా కాకుండా పక్షపాతంగా వున్నానని భావం కలిగినప్పుడు దానికి బాధ్యత నేను పార్టీలో ఉండడం అనే భావం కలిగినట్లయితే

తప్పకుండా ఆ రోజు నిర్ణయం చేసుకుంటా. నేను పార్టీకి కట్టుబడి ఉండాలా లేక అధ్యక్షపదవికి కట్టుబడి ఉండాలా అనే సమస్య గురించి ఆలోచిస్తాను. అంచేత దయచేసి శ్రద్ధగా మనసులో పెట్టుకోవద్దని తమకు తెలియచేస్తున్నాను. ఆఖరున తిరిగి మరొకసారి మనమందరం కూడా ఇటీవలనే ఎన్నికలలో పాల్గొన్నాం. నేను కూడా ఎన్నికలలో పాల్గొన్నప్పుడు నా నియోజకవర్గంకు సంబంధించినంత వరకు ప్రతియొక్క గ్రామాన్ని చూసే భాగ్యం కలిగింది. కేవలం వోట్ల కొరకు వెళ్లడంకాదు. కాని మన మన నియోజకవర్గాలకు సంబంధించిన గ్రామాలకు అక్కడవుండే ప్రజలు అక్కడ ఉండే సమస్యలు ఆ సమస్యలపట్ల ప్రజల ఆలోచనలు ఎట్లా ఉన్నాయి అనేటటువంటిది గ్రహించే భాగ్యం మీతోపాటు నాకు కూడాకలిగింది. ఒక నూతనమైన చైతన్యం ప్రజలలో వచ్చింది. మార్పు చూస్తున్నప్పుడు ఆ మార్పు దృష్టిలో పెట్టుకొని మనంకూడా దానికి తగ్గట్లుగా ప్రభుత్వము ప్రతిపక్షాలు, మనం అందరం కూడా ప్రజల సేవచేయడానికి వచ్చిన మనం అందరం మన పట్ల చూపించిన విశ్వాసానికి తగినట్లుగా కార్యకలాపాలను నిర్వహించుకుంటామని దానికొరకు మీ యొక్క సంపూర్ణమైన సహకారాన్ని యిస్తూ సభయొక్క గౌరవాన్ని హుందాతనాన్ని కాపాడాలనేటటువంటి మాట ఆఖరున మీ అందరికి జ్ఞాపకం చేస్తూ ముఖ్యమంత్రిగారు చెప్పినటువంటి మాటలకు అట్లాగే ఉపముఖ్యమంత్రి గారు చెప్పిన మాటలకు పలువురు గౌరవసభ్యులు ప్రతిపక్షాలకు చెందిన గౌరవ సభ్యులు చెప్పిన మాటలకు మరొకసారి నా హృదయపూర్వకమైన నమస్కారాలు చెబుతూ శలవు తీసుకుంటున్నాను.



## శ్రీ ఆర్. దశరథరామి రెడ్డి

28-01-1975 నుండి 14-03-1978

# శ్రీ రేబాల దశరథరామి రెడ్డి

శ్రీ రేబాల దశరథరామి రెడ్డి అయిదవ శాసనసభ (1972-1978) స్పీకరుగా 1975వ సంవత్సరం జనవరి 28వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1978వ సంవత్సరము మార్చి 14వ తేదీ వరకు ఆ పదవిలో కొనసాగారు.

వీరి హయాంలో 1976-77 సంవత్సరంలో మొదటి సారిగా అనుసూచిత వర్ణముల సంక్షేమ కమిటి, అనుసూచిత జాతుల సంక్షేమ కమిటి, వెనుకబడిన తరగతుల సంక్షేమ కమిటి, లైబ్రరీ కమిటీలను ఏర్పాటు చేశారు.

వీరు 1907వ సంవత్సరము నవంబరు 30వ తేదీన నెల్లూరు జిల్లా కావలిలో జన్మించారు.

మద్రాసు విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. డిగ్రీని, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుంచిఎల్.ఎల్.బి. డిగ్రీని పొంది కొంత కాలం పాటు అడ్వకేటుగా ప్రాక్టీసు చేశారు. 1947-1951 సంవత్సరాల మధ్య కాలంలో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేశారు. 1940వ సంవత్సరంలో సత్యాగ్రహంలో పాల్గొన్నందుకుగాను జైలు శిక్ష అనుభవించారు.

శ్రీ దశరథరామి రెడ్డి అనేక పదవులను నిర్వహించారు. రాష్ట్ర రోడ్డు రవాణా అథారిటీలో అనధికార సభ్యునిగా అయిదు సంవత్సరాలు పనిచేశారు. ఆల్ ఇండియా కో-ఆపరేటివ్ అడ్మినిస్ట్రేటివ్ రిఫార్మ్స్ కమిటీ ఉపాధ్యక్షులుగా, మద్రాసు స్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షులుగా, డిస్ట్రిక్ట్ కో-ఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షులుగా, ఆంధ్ర స్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షులుగా, ఆంధ్రప్రదేశ్ స్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షులుగా, కోస్టల్ ఆంధ్ర ప్లానింగ్ అండ్ డెవలప్‌మెంట్ కమిటీ అధ్యక్షులుగా పనిచేశారు.

శ్రీ దశరథరామి రెడ్డి 1960 సంవత్సరములో (ఉప ఎన్నిక) మొదటిసారిగా నెల్లూరు జిల్లా కావలి నియోజకవర్గం నుండి ఆంధ్రప్రదేశ్ రెండవ శాసనసభకు ఎన్నికైనారు. తిరిగి 1962వ సంవత్సరము మూడవ శాసనసభకు నెల్లూరు జిల్లా కోవూరు నియోజకవర్గం

నుండి, 1972వ సంవత్సరము ఐదవ శాసనసభకు అల్లూరు నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. వీరు 1967-1970 సంవత్సరాల మధ్య కాలంలో కావలి నియోజకవర్గం నుండి లోక్‌సభ సభ్యునిగా ఉన్నారు.

స్పీకరుగా శ్రీ దశరథరామి రెడ్డి సమర్ధవంతంగా పనిచేశారు. సభాసమక్షంలో పత్రాలను ఉంచేవారు ఆ పత్రాలను ఏ నిబంధన క్రింద, నియమావళి క్రింద, ఉపనియమావళి క్రింద ఉంచుతున్నారో ధృవీకరించవలసి ఉంటుందని శ్రీ దశరథరామ రెడ్డి 1975, ఫిబ్రవరి 22వ తేదీన ఇచ్చిన రూలింగులో స్పష్టం చేశారు.

శ్రీ రేబాల దశరథరామి రెడ్డి 2005వ సంవత్సరం జూన్ 9వ తేదీన మరణించారు.

## శ్రీ దశరథరామి రెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

సభానాయకులు ముఖ్యమంత్రిగారు, వివిధ పార్టీ నాయకులు, గౌరవ సభ్యులు యీ శాసనసభ అధ్యక్ష పదవికి సంపూర్ణ హృదయంతో నన్ను ఎన్నుకొన్నందుకు మీ అందరికీ నా హృదయపూర్వక అభివందనాలు తెలియ పరుస్తున్నాను. ముఖ్యంగా, గూడూరు నుండి, ఏలూరునుండి ఎన్నికైన సభ్యులు యీ పోటి నుండి విరమించుకొని ఏకగ్రీవంగా ఎన్నిక జరిపినందుకు వారికికూడ ప్రత్యేకంగా నా హృదయపూర్వక వందనములు. మీరందరు రెండుమూడు గంటలనుండి ఎన్నో సలహాలు సూచనలు చేసినారు. ముఖ్యంగా నాపట్ల వ్యక్తిగతంగా అనేకమైన మంచి మాటలు చెప్పినారు. సభానాయకులు, ప్రతిపక్ష నాయకులు, సభ్యులు నాపట్ల గౌరవసూచకంగా ప్రేమ పూర్వకంగా చెప్పిన మాటలకు నా నమస్కారములు తెలియజేస్తున్నాను. శాసనసభా వ్యవహారములలో నా విద్యుక్తధర్మం నెరవేర్చటంలో నిష్పక్షపాతంగా ప్రవర్తించగలనని సవినయంగా మీకు మనవిచేస్తున్నాను. శాసనసభ్యులలో అన్ని పక్షముల వారి వాదనను సమదృష్టితో పరిశీలించి నా బాధ్యత సర్వజనామోదకంగా నిర్వహించటంలో మీ పూర్తి సహకారం నాకు లభించగలదని మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నాను. ఈ సభ యొక్క ప్రాభవ వైభవములను, గౌరవ మర్యాదలను కాపాడుటకు మునుపటి అధ్యక్షులు చూపిన శ్రద్ధాసక్తులు, సభ్యులు చూపిన సహకారము శ్లాఘనీయమైనది. ఇకముందు కూడ సభా గౌరవ మర్యాదలను పరిరక్షించటములో నా శక్తివంచన లేకుండా కృషిచేయగలనని వాగ్దానం చేస్తున్నాను. మీ ప్రేమాభిమానములతో, సహకారముతో నా మాట నిలబెట్టుకో గలనని దృఢంగా నమ్ముతున్నాను. ఈనాడు మన రూల్సు గురించి ప్రస్తావించినారు. ఈ రూల్సు మన సభవారు ఏర్పాటు చేసుకొన్నటువంటివే. ఈ సభా కార్యక్రమాన్ని సక్రమంగా నిర్వహించటానికి మనం ఏర్పాటు చేసుకొన్నటువంటివి. వాటిలో ఏవైనా లోటుపాట్లు ఉంటే యీ సభయొక్క హుందాతనానికి, గౌరవానికి, యీ సభలో జరిగే చర్చలు సక్రమంగా నిర్వహించటానికి అవి అంత తోడ్పడక పోతే అవి తప్పకుండా మార్చుకొనే హక్కు మనకు ఉంది. ప్రతిపక్షం వారుగాని, ప్రభుత్వపక్షం వారుగాని అటువంటి విషయాలు నా దృష్టికి తీసుకువచ్చినపుడు మనమందరం వాటిని గురించి మాట్లాడుకొని వాటిని

తప్పకుండా మార్చుకోటానికి అవకాశం ఉంది. ఆ విధంగా మార్పు చేసుకొంటామని చెబుతున్నాను. ఈనాడు గౌరవ సభ్యులు కొంత మంది ఇక్కడకు వచ్చినపుడు వారి వెహికిల్స్ రాకుండా అడ్డు పెట్టారని, అందువల్ల వారి గౌరవానికి ఆటంకం కలిగిందని చెప్పినారు. అటువంటిది జరగకుండా ఇకమీదట కృషి చేస్తానని చెబుతున్నాను. కృషిచేయటమేకాదు, తప్పకుండా దానిని అమలు జరుపుతానని చెబుతున్నాను. అందుకు ముఖ్యమంత్రిగారు, అందరూ తప్పకుండా సహకరిస్తారని నేను విశ్వసిస్తున్నాను. రంగారెడ్డిగారు ఇంతకు ముందు మూడు సంవత్సరాలుగా ఇక్కడ స్పీకరుగా ఉంటూ వచ్చినారు. వారు సత్ సాంప్రదాయాన్ని అంతకుముందు ఉన్న దానిని నిలబెట్టటమే కాకుండా, వారు దానిని ఇంకా హుందాతనంగా చేసి, హెచ్చు స్థాయిలో యీ సభయొక్క కార్యక్రమాలు నిర్వహించినందుకు వారిని అభినందిస్తున్నాను. నేను చెప్పవలసిన అనేక విషయాలు వారే తెలియచేసినారు. ఈనాడు వారు చెప్పిన విషయాలు వారు స్పీకర్ అయిననాడు కొంత చర్చకు వచ్చింది. వారు అప్పుడు మాట్లాడినపుడు కూడ యీ స్పీకర్ పని ఏ రకంగా ఉండవలెను, ఒక పార్టీలో ఉండవలెనా, ఒక పార్టీలో ఎన్నికైన తర్వాత ఆ పార్టీనుండి విరమించుకోవలెనా యీ విషయాలన్నీ ఇంతకు ముందే వారు చెప్పినారు. ఈనాడు యీ దేశంలో ఉన్న పరిస్థితులను బట్టి అవి అమలు జరపటానికి వీలున్నదా లేదా అమలు జరిపినట్లయితే సక్రమంగా కార్యక్రమాలు నిర్వహించటానికి వీలువుతుందని వారు అభిప్రాయం చెప్పారు. వారు తెల్పిన ఆభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. ముఖ్యంగా యీ సభ కార్యక్రమాన్ని జరపటానికి మీ అందరి యొక్క సహకారం పూర్తిగా లేనట్లయితే నేను ఏదీ కూడ నిర్వహించటానికి వీలుండదు. తప్పకుండా మీ సహకారం ఉంటుందని నేను విశ్వసిస్తున్నాను. అందుకు కావలసిన నేర్పు, ఓర్పు ఔదార్యము మనందరికి భగవంతుడు ప్రసాదించుగాక అని ప్రార్థిస్తూ యీ బాధ్యతాయుతమైన ఉన్నత పదవిని నాకు అప్పగించినందుకు మరొకసారి మీకు హృదయ పూర్వక వందనములు తెలియజేస్తున్నాను. జైహింద్



**శ్రీ వివి కొండయ్య చౌదరి**

16-03-1978 నుండి 16-10-1980

# శ్రీ దివి కొండయ్య చౌదరి

శ్రీ దివి కొండయ్య చౌదరి ఆరవ శాసనసభ (1978-1983) స్పీకరుగా 1978వ సంవత్సరము మార్చి 16వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1980వ సంవత్సరము అక్టోబరు 16వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1918వ సంవత్సరము జూలై ఒకటవ తేదీన ప్రకాశం జిల్లా కందుకూరు మండలం మహాదేవపురం గ్రామంలో జన్మించారు. వీరు కందుకూరు హైస్కూలులో చదువుకున్నారు. మద్రాసు లయోలా కాలేజీ నుండి బి. ఎ. డిగ్రీని, తదుపరి మద్రాసు లా కాలేజి నుండి బి.ఎల్. డిగ్రీని పూర్తి చేశారు.

శ్రీ కొండయ్య చౌదరి స్వాతంత్ర్య సమరయోధులు. వీరు జిల్లా పంచాయతీ బోర్డు అధ్యక్షునిగా పనిచేశారు. 1955వ సంవత్సరము రెండవ శాసనసభ, 1978వ సంవత్సరము ఆరవ శాసనసభకు ప్రకాశం జిల్లా కందుకూరు నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. వీరు 1966 నుండి 1972 వరకు విధాన పరిషత్తు సభ్యునిగా ఉన్నారు. శ్రీ టంగుటూరి అంజయ్య మంత్రి వర్గంలో రోడ్లు, రహదార్లు, భవనాలు, ప్రజా పనుల శాఖ మంత్రిగా 17-10-1980 నుండి 24-02-1982 వరకు పనిచేశారు.

వీరి హయంలో 1978వ సంవత్సరం జూన్ నెలలో అప్పటి రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవ రెడ్డి శాసనసభను ఉద్దేశించి ప్రసంగించారు.

శాసనసభలో బిల్లులపై సమగ్రమైన చర్చలు జరగాలని, ఆ చర్చలలో సభ్యులు అర్థవంతమైన సమగ్ర సమాచారంతో చర్చలను సుసంపన్నం చేయాలని పేర్కొంటూ శ్రీ కొండయ్య చౌదరి ప్రశంసనీయమైన రూలింగులను ఇచ్చారు.

స్నేహశీలిగా, సౌమ్యుడిగా, ప్రముఖ న్యాయవాదిగా పేరు పొందిన శ్రీ కొండయ్య చౌదరి 1990వ సంవత్సరం నవంబరు 13వ తేదీన మరణించారు.

## శ్రీ దివి కొండయ్య చౌదరి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

ఇప్పుడు చాలా కాలాతీతం అయింది. అందువల్ల మిగతా సభ్యుల పేర్లు పిలవడానికి అవకాశం లేకుండా పోయింది. వారందరికి కూడా భవిష్యత్తులో ఎక్కువ అవకాశాలు దొరుకుతాయి. అప్పుడు తమ అభిప్రాయలను వెలిబుచ్చడానికి అవకాశం వుంటుంది. ఇంతవరకు దాదాపు **45** మంది మాట్లాడారు. చాలా గొప్ప సంగతి.

గౌరవనీయులైన సభా నాయకులు చెన్నారెడ్డిగారు, గౌరవనీయ ప్రతిపక్ష నాయకులు లచ్చన్నగారు, గౌరవనీయులు పి. సుందరయ్యగారు, గౌరవనీయ భాట్టం శ్రీరామమూర్తిగారు, సి.హెచ్. రాజేశ్వరరావుగారు, మిత్రులారా, ఇంతవరకు నా ఎన్నిక గురించి అనేక మంది చెప్పారు. ప్రప్రథమంగా మీరందరు, అందులో నాయకులందరు కలసి ఏకగ్రీవంగా నన్ను ఎన్నిక చేసినందుకు హృదయపూర్వక అభినందనాలు తెలుపుతున్నాను. ఈ ఎన్నిక అయిన తరువాత అనేక విషయాలు మీరు అందరు చెప్పివున్నారు. స్పీకరు అంటే అసలు సాధారణంగా మాట్లాడరు అనే ఒక సాంప్రదాయం వుంది. మాట్లాడనివారికి స్పీకరు అని ఎందుకు పేరు పెట్టారు అంటే దానికి చరిత్ర ఉంది. ఆ చరిత్రలోకి పోవలసిన అవసరం లేదు. పరిస్థితులు మారాయి. అందువల్ల యిప్పుడు స్పీకరు ఒక్కొక్కసారి ఎక్కువగా మాట్లాడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఏది ఏమైనప్పటికి నాకు ముందు యీ స్థానాన్ని గొప్పవారు అలంకరించి వున్నారు. అయ్యదేవర కాళేశ్వర రావుగారు, దశరథరామిరెడ్డిగారు, పి. రంగారెడ్డిగారు, బి.వి. సుబ్బారెడ్డిగారు వగైరా గొప్ప ప్రజ్ఞావంతులు పెద్ద పెద్ద న్యాయవాదులు మంచి అనుభవం సంపాదించినవారు యీ స్థానాన్ని అలంకరించి దీనికి వన్నె తెచ్చారు. వారు అనేక సాంప్రదాయాలను నెలకొల్పి వున్నారు. ఆ సత్సాంప్రదాయాలను మనము పోషించాలి. అది గురుతరమైనటువంటి బాధ్యత. అంతకంటే నూతన సాంప్రదాయాలను నెలకొల్పాలని ప్రతిపక్ష నాయకులు కోరారు. ఈ రూల్సును మార్చాలి. ఇవి అన్ని కూడా అభ్యుదయానికి చాలా అటంకముగా పరిణమిస్తున్నాయి, యిక్కడ సరైనటువంటి చర్చలకు అవకాశం లేకుండా వుంటున్నది, రూల్సును మారిస్తే బాగుంటుందనే అభిప్రాయాన్ని ఎక్కువమంది

ప్రతిపక్షములో నుండి చెప్పారు. దానికి సందర్భము చూచుకొని, ఏ రూల్సు చర్చలకు అవరోధం కల్గిస్తున్నాయో వాటిని చర్చించుకొని అవసరమైతే మార్చడానికి సభానాయకులు వెనుకంజ వేయరు. ప్రజాస్వామ్యములో చర్చల ద్వారానే మంచి సాంప్రదాయాలను నెలకొల్పడానికి అవకాశం వుంది. చర్చలు లేకపోతే నియంతృత్వం అవుతుంది. చర్చల ద్వారా విషయాలను చర్చించుకొని నిర్ణయానికి రావలసి వుంటుంది. అత్యధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని పాటించి, ఆమోదించిననాడే ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది అనే విషయం అందరికి తెలుసు, అందువల్ల చర్చలకు ఎక్కువ అవకాశం యివ్వాలి. అయితే టైము సరిపోదని సుందరయ్యగారు చెప్పారు. సమావేశాలు దాదాపు 90 రోజులే వుంటాయి. కూలంకషంగా విషయాలను చర్చించడానికి వీలుండదని చెప్పారు. సభా నాయకులతో చర్చించి అవసరమైతే కాలవ్యవధిని పొడిగించడానికి ప్రయత్నం చేద్దాము దానివల్ల తప్పు లేదు. ఇది అనాదిగా వస్తున్నటువంటి బాధ, పూర్వంకూడా ప్రతిపక్ష నాయకులు టైము చాలడం లేదు, సెషను ఎక్కువరోజులు పెట్టాలని చెబుతూవచ్చారు. పార్లమెంటు ఆరు మాసాలు జరుగుతుంది. మనకు మూడు మాసాలలోపే జరుగుతుందనే బాధ వుంది, సభా నాయకులు, అందరు కలసి కూర్చుని ఎక్కువ కాలం విషయాలు చర్చించడానికి అవకాశం వుండేటట్లు కాలము పొడిగించడానికి ప్రయత్నము చేద్దాము. పోతే క్వశ్చన్సుకు సరైనటువంటి జవాబులు రావని చెబుతూ వచ్చారు. క్వశ్చన్సు వేసినప్పుడు అన్ని క్వశ్చన్సుకు ఆన్సర్సు రావాలని కోరుతారు. లేకపోతే ఒక క్వశ్చనుతోనే సరిపోతుంది. రెలవన్సీ అనేది చూడకుంటే ఒక ప్రశ్నతో కాలం అయిపోతుంది. అవి మన ప్రతిపక్ష సభ్యులు కాని ట్రెజరీ బెంచీలలో ఉన్న సభ్యులు కాని ఎవరైనా రెలెవెన్సీ చూసుకొని అన్సర్సును రాబట్టు కొనడానికి ప్రయత్నము చేయాలి. ప్రపంచములో ఉండే ప్రశ్నలన్నీ సప్లిమెంటరీ ప్రశ్నల క్రింద వేస్తే ఒక ప్రశ్నతోనే టైము అయిపోతుంది. కాబట్టి ప్రతి సభ్యుడూ రెలెవెన్సి పాటించి ఉప ప్రశ్నలు వేస్తే అన్ని ప్రశ్నలు పూర్తి చేయడానికి అవకాశం ఉంటుంది. కాబట్టి గౌరవ సభ్యులందరూ అలాగే చేయాలని మనవిచేస్తున్నాను. స్పీకరుగా ఏ పార్టీకి సంబంధించకుండా ఉండాలని కొందరు గౌరవ సభ్యులు తమ అభిప్రాయమును వెలిబుచ్చారు. స్పీకరు పదవి రాగానే కొంత మంది పెద్దలు పార్టీకి అతీతులైనారు. కొందరు పార్టీలోనే ఉండి చేశారు. ప్రిసైడింగు ఆఫీసర్స్ కాన్ఫరెన్స్‌లో కూడా ఇది చర్చకు వచ్చింది. కాని ఇతమిద్ధమైన నిర్ణయానికి రాలేకపోయారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డిగారు పార్టీకి

అతీతులుగా ఉండాలని చెప్పారు. శ్రీ పిడతల రంగారెడ్డిగారు పార్టీలో ఉంటూ ఏ రాజకీయ పార్టీకి సంబంధం లేకుండా ఉంటానని చెప్పారు. శ్రీ రంగారెడ్డిగారి పద్ధతి ప్రకారం పార్టీనుంచి విరమించుకోకుండా రాజకీయ పార్టీలకు సంబంధం లేకుండా స్వతంత్రంగా వ్యవహరిస్తానని గౌరవ సభ్యులకు హామీనిస్తున్నాను. భగవంతుడు నాకు ఇచ్చిన శక్తి కొలదీ ఇండిపెండెంటుగా డెసిషన్సు తీసుకుంటానని మనవిచేస్తున్నాను. ఎప్పుడైనా క్లిష్టపరిస్థితులలో డెసిషన్సు తీసుకొనడంలో 2, 3 రోజులు ఆలస్యమైనా గౌరవసభ్యులు వేరే విధంగా ఆపోహపడవద్దని మనవి చేస్తున్నాను. అది గౌరవసభ్యులు గమనించాలని కోరుతున్నాను. నేను పార్టీలో ఉన్నంత మాత్రాన శాసనసభా నిర్వహణకు భంగం ఏర్పడుతుందని ఎవరూ అనుకోనక్కరలేదు. నేను 20 సంవత్సరాలు ప్రతిపక్షంలో ఉన్నటు వంటి వాడిని. ఎప్పుడూ ఆఫీసులో లేను. గౌరవ సభ్యులకు కావలసిన సౌకర్యాలు నాకు తెలియనివికావు. అందుచేత ప్రతిపక్షాలను చిన్నచూపు చూస్తానని కాని ప్రభుత్వ పక్షంలో సంఖ్యాబలం ఎక్కువ ఉందని వారిని ఎక్కువ చూస్తానని కాని అనుకోనవసరం లేదని మనవి చేస్తున్నాను. ప్రజాస్వామ్యంలో ప్రతిపక్షం, ప్రభుత్వ పక్షం అనేవి రెండూ బండికి చక్రాల వంటివి. అందులో ఏ చక్రము లేకపోయినా బండి నడవదు. కాబట్టి ప్రజాస్వామ్యంలో ప్రతిపక్షానికి ఎంతో విలువ ఉంటుంది. నేను ప్రతీ విషయములోను ఇంపార్షియల్‌గా ఉంటాను. నా డెసిషన్స్ బయాస్డ్‌గా ఉంటాయిని అనుకొనక్కరలేదు. జుడిషియస్‌గా ఉంటానని మనవి చేస్తున్నాను. గౌరవ సభ్యులు అనేకమంది నాగురించి ప్రశంసా విషయాలు చెప్పారు. నేను వాటన్నింటికి తగుదునని అనుకోవడంలేదు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డిగారు కొన్ని విషయాలు చెబుతూ ఉండేవారు. ఈ సభను చాలా టాక్టుతో, హ్యూమరుతో, కాలిబర్‌తో నడిపేవారు ఉండాలని చెప్పారు. నాలాంటి వారు కొంత వెనుకముందు ఆలోచించవలసిన అవసరం ఉంటుంది. దీనికి ఎవరూ అపోహపడనక్కరలేదు. నేను ఇండిపెండెంటుగా డెసిషన్సు తీసుకుంటాను. కాని బయాస్డ్ డెసిషన్ తీసుకోను. ఇది అనుభవం మీద రావలసిన విషయం. పుట్టుకతో వచ్చే వ్యవహారం కాదు. శ్రీ రంగారెడ్డిగారికి ఇప్పటికి దాదాపు 30 సంవత్సరాల అనుభవం పదవులలో ఉంది. కాబట్టి వారు హుందాతనంగా, మర్యాదగా ప్రవర్తించారు. నేను ఈ సభ యొక్క మర్యాదను, హుందాతనాన్ని, గౌరవాన్ని కాపాడడానికి, గౌరవ సభ్యుల యొక్క హక్కులను పెంపొందించడానికి నా సర్వశక్తులా ప్రయత్నము చేస్తానని మనవిచేస్తున్నాను. దానికి

మీ అందరియొక్క సహాయసహకారాలు కావాలని కోరుతున్నాను. సహకారం అనే దానిని గురించి విఠల్‌భాయ్ పటేల్ చెప్పి ఉన్నాడు. సహకారం అనేది రెండు వైపులా ఉండాలని, అది మ్యూచువల్‌గా ఉండాలని చెప్పాడు. అలాగ జరిగినప్పుడే సహకారానికి విలువ ఉంటుంది. ఆ విధంగా మీ అందరి సహకారంతో ఆంధ్రప్రదేశ్ శాసనసభ గౌరవాన్ని, హుందాతనాన్ని పెంపొందించగలనని మనవిచేస్తున్నాను. భారతదేశంలోని అన్ని శాసనసభలలో కెల్లా ఆంధ్రప్రదేశ్ శాసనసభ చాలా మిన్న అయినది, హుందాగా ప్రవర్తిస్తున్నది అనే ఖ్యాతి వచ్చేట్లు ప్రయత్నించగలనని మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాను.



## శ్రీ కోన ప్రభాకర రావు

24-02-1981 నుండి 22-09-1981

# శ్రీ కోన ప్రభాకరరావు

శ్రీ కోన ప్రభాకరరావు ఆరవ శాసనసభ (1978-1983) స్పీకరుగా 1981వ సంవత్సరం ఫిబ్రవరి 24వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1981వ సంవత్సరం సెప్టెంబరు 22వ తేదీ వరకు ఆ పదవిలో కొనసాగారు. వీరి హయాంలో 1981వ సంవత్సరంలో రెండవసారి అఖిల భారత స్పీకర్ల సదస్సు హైద్రాబాదులో జరిగింది.

వీరు 1916వ సంవత్సరం జూలై 10వ తేదీన గుంటూరు జిల్లా బాపట్లలో జన్మించారు. గుంటూరులోని ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీలో బి.ఎ. డిగ్రీని, తదుపరి పూనాలోని లా కాలేజీ నుండి ఎల్.ఎల్.బి. డిగ్రీని పూర్తి చేసారు. కొంత కాలం న్యాయవాదిగా పనిచేశారు.

వీరు 1967వ సంవత్సరంలో నాల్గవ శాసనసభకు, 1972వ సంవత్సరములో ఐదవ శాసనసభకు, 1978వ సంవత్సరములో ఆరవ శాసనసభకు గుంటూరు జిల్లా బాపట్ల నియోజకవర్గం నుండి ఎన్నికైనారు.

శ్రీ ప్రభాకరరావు, శ్రీ భవనం వెంకట్రామ్ మంత్రి వర్గంలో ఆర్థిక ప్రణాళిక, చిన్న మొత్తాల పొదుపు, లాటరీలు, సమాచార పౌర సంబంధాల శాఖ మంత్రిగా 28.02.1982 నుండి 20.09.1982 వరకు, శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి మంత్రి వర్గంలో ఆర్థిక ప్రణాళికా శాఖ మంత్రిగా 20.09.1982 నుండి 09.01.1983 వరకు పనిచేసారు.

సభాపతిగా పనిచేసిన కాలంలో అత్యంత విలువైన రూలింగులు ఇచ్చారు. ప్రభుత్వం జారీ చేసిన ఆర్డినెన్సు స్థానే శాసనసభలో బిల్లును ప్రతిపాదింపగోరే సమయంలో ఆ ఆర్డినెన్సును ఏ కారణాల వల్ల జారీ చేయవలసి వచ్చిందో తెలియజేస్తూ ఒక వివరణాత్మక పత్రాన్ని ఎటువంటి పరిస్థితులలోనైనా ఖచ్చితంగా జతచేయవలసి ఉంటుందని శ్రీ కోన ప్రభాకర రావు 1981, మార్చి 2వ తేదీన ఇచ్చిన రూలింగులో విశదీకరించారు.

వీరు పాండిచ్చేరి, సిక్కిం రాష్ట్రాల లెఫ్టినెంట్ గవర్నర్‌గా, మహారాష్ట్ర గవర్నర్‌గా పనిచేసారు.

సౌమ్యుడు, స్నేహశీలి, కళాకారుడు అయిన శ్రీ ప్రభాకరరావు 1990వ సంవత్సరం అక్టోబరు 10వ తేదీన మరణించారు.

## శ్రీ కోన ప్రభాకరరావు స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

సభానాయకులు అంజయ్యగారు, ప్రతిపక్ష నాయకులు సుందరయ్యగారు, లచ్చన్నగారు, జైపాల్‌రెడ్డిగారు, రాజేశ్వరరావుగారు, వెంకయ్యనాయుడుగారు, మిత్రులారా ఈ కార్యక్రమానికి దాదాపు రెండు గంటలు పట్టింది. ఒకప్పుడు నేను కూడా ఇలాగే ఇక్కడ కూర్చున్న సభాపతిని శ్లాఘిస్తూ మాట్లాడిన వాడినే. ఒక ప్రముఖ న్యాయవాదిని నీవు హైకోర్టు జడ్జిగా వెడతావా అని అడిగితే ఆయన ఒక సమాధానం చెప్పాడు. ఎంత సమయం అయినా సరే నా ఇష్టం వచ్చినట్లు మాట్లాడటానికి నాకు ఓపిక వుంది కాని ఇంకెవరో నాలుగు గంటలు మాట్లాడితే వినడం కష్టం అని సమాధానం ఇచ్చాడట. నా గురించి రెండు గంటల నుండి చెబుతూవుంటే కొద్ది బాధగా వుందనుకోండి అయినా తప్పదు. నన్ను ఈ స్థానానికి ఏకగ్రీవంగా ఎన్నుకొన్నందుకు మీ అందరకూ నా నమస్కారాలు. నన్నుగురించి మాట్లాడుతున్న సందర్భంలో మిత్రులు జైపాల్‌రెడ్డిగారు ఒక మాట అన్నారు. "Like the Tower of Pisa, you may lean but do not fall" అని. నేను వారికి ఒక మాట మనవిచేస్తున్నాను. I may appear to lean but I do not lean. So I do not fall అని. అధ్యక్షస్థానంలో వున్నవారు ప్రతిపక్షం వైపు చూస్తారు, స్వపక్షం వైపు చూడరనే గ్రీవెన్స్ ఒకటి వుంది. ఇదివరకు ఎట్లా వున్నదో ఏమో కాని ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. ఆ మూల నుండి ఈ మూల వరకూ స్వపక్షం వారు వున్నారు.

పూల సుబ్బయ్యగారు ఒక ముఖ్య విషయం చెప్పారు. ఇది చాలా కాలంగా చాలామందిని వేధిస్తున్న సమస్య. అధ్యక్షుడు అయిన వారు పార్టీ నుండి రాజీనామా చేసి ఏ పార్టీకి చెందనివాడుగా వుండాలా లేక పార్టీలో వుంటూనే నడిపించవచ్చునా అనేది ఆ సమస్య. కన్వెన్షన్స్ అటూ ఇటూ కూడ వున్నాయి. ఒక ఐడియాలజిని నమ్మిన వ్యక్తి ఆ పార్టీకి రాజీనామా చేసినంత మాత్రాన వాటిని నమ్మకుండా వుంటాడనేది తప్పు. సూత్రప్రాయంగా రాజీనామా చేసినా నడిచే నడకలో ఏపార్టీనుండి వచ్చారో దానిని బలపరిస్తే అది హిపోక్రసి అవుతుంది కాని మరొకటి కాదు. నేను చాలాకాలం ఎడ్వకేటుగా పనిచేశాను. ఎడ్వకేట్ వృత్తిలో వున్న గొప్పదనం ఏమిటంటే అబ్జెక్టివ్‌గా నడవాలి. సక్సెస్‌ఫుల్

కావాలంటే అబ్జెక్టివ్‌గా పని చేయాలి. సబ్జెక్ట్‌ను అబ్జెక్టివ్‌గా తీసుకొని, పార్టీ రహితంగా, పార్టీకి అతీతంగా సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నం చేస్తానని హామీ ఇస్తున్నాను. నాపై గురుతరమైన బాధ్యత వుందని అనుకుంటున్నాను. ఈ నాలుగు గోడల మధ్య వున్న ఈ సభకు అధ్యక్షుడుగా వున్న వ్యక్తికి తిరుగులేని అధికారం వుంది. హైకోర్టు జడ్జి కంటే ఎక్కువ అధికారాలు వున్నాయి. హైకోర్టు జడ్జి తప్పు చేస్తే దానికి అప్పీలు వుంది, డివిజన్ బెంచికి పోవచ్చు. ఇక్కడ అధ్యక్షుడు తప్పు చేస్తే దానికి అప్పీలు లేదు. ఏదైనా నిర్ణయం చేసేటప్పుడు గురుతరమైన బాధ్యత అధ్యక్షుని పై వుందని నేను గుర్తించాను. ఆ మాదిరిగా వ్యవహరించటానికి నేను ప్రయత్నం చేస్తానని హామిఇస్తున్నాను. కొత్త పంథాను త్రొక్కుతామా అన్న ఆలోచన అప్పుడప్పుడు వస్తూవుంటుంది. ఇక్కడ జరిగే కార్యక్రమాలకు సంబంధించి స్పీకరు ఒక రిఫరి. సక్రమంగా, ప్రశాంత వాతావరణంలో ఈ సభను నడపడంలో స్పీకరు డ్యూటీస్ పరిమితంగా వున్నాయి. అయితే నేను అనుకుంటున్నాను, రాజకీయంగా అనేక పార్టీలవారికి, వారి వారికి వున్నటువంటి ఐడియాలజీస్, వున్నా అందరి ధ్యేయం సమాజములో ప్రతి మానవుడియొక్క శ్రేయస్సును దృష్టిలో పెట్టుకునే చేస్తున్నామని చెబుతున్నారు గాబట్టి ఒక చోట కాంగ్రెస్ పభ్రుత్వం రావచ్చు, యింకొక చోట కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం రావచ్చు, మరొక చోట లోక్‌దళ్, యింకొక చోట బి.జె.పి రావచ్చు, ఎవరు వచ్చినా ఎవరు చెప్పినా మా కార్యక్రమం ప్రకారం మేము అనుకున్న పంథా ప్రకారం ప్రజలకు శ్రేయస్సు చేకూరుతుందని, ఆ అభిప్రాయముతోనే ప్రజలనుండి ఓట్లు తెచ్చుకున్నామని, ప్రజలు మన మనస్సులను నమ్మి, మన మంచిని నమ్మి ఓట్లు యిచ్చారు. ఈ అయిదు సంవత్సరాల కొరకు ఏ ప్రభుత్వాన్ని అయితే ప్రజలు పంపారో ఆ ప్రభుత్వం యొక్క మ్యానిఫెస్టో అమలుపరచి, అవకాశం కల్పించి వారి శ్రేయస్సుకు పూనుకున్నప్పుడు వారు చేప్పే సూత్రాలను నమ్మడానికి అవకాశం వుంటుందని నా అభిప్రాయం. కానప్పుడు, ప్రజలు చూశారా మేము సహకరించాము, అయినా వారు చేయలేకపోయారు అంటారు. ప్రభుత్వానికి వచ్చిన మరునాడు నుండే యీ ప్రభుత్వం ఎట్లా పోవాలని అనేక వాదనలు వస్తే ఎప్పటికప్పుడు మనస్పర్ధలు, తగాదాలు వస్తే, అవి తగాదాలుగానే మిగిలిపోతున్నాయి. ప్రజలను మరచిపోతున్నాము. ఈ పద్ధతిలో గాకుండా నేను అనుకుంటున్నాను. నాలుగు గోడల

మధ్యకంటే ప్రజలయొక్క సమస్యలు క్లిష్టమైనటువంటి సమస్యలు అపూర్వమైనటువంటి వాతావరణములో వచ్చినప్పుడు అన్ని పార్టీల మధ్యన అవగాహన తీసుకువచ్చి సరైన శాంతి మార్గంలో పరిపాలన సాగేలా చేయడం మంచిది. బయట అల్లర్లు, సభలో అల్లర్లు జరుగుతూవుంటే ప్రజాస్వామ్య సూత్రాలపైన ప్రజలకు విశ్వాసం పోయే పరిస్థితి వస్తుంది. అందుకని అందరి బాధ్యత దీని మీద వుంది. ఇక్కడకు ఎన్నిక అయి వచ్చిన ప్రతివాడు రెండు లక్షల మంది ప్రజలకు ప్రతినిధి. తక్కువ వాడు యిందులో లేడు, నాకు స్వపర భేదం లేదు, నేను చూపించను, చేయను. సంవత్సరంలో మనం కలిసేది 90 రోజులు. అందులో 20 రోజులు ఏదో కారణంగా సెలవులు పోతున్నాయి. యాక్చువల్‌గా కలిసేది 70 రోజులు. ఈ కార్యక్రమాలను డిస్‌ప్లిన్‌గా చేసుకుంటే ప్రతివారికి సావకాశం రావడానికి ప్రయత్నం చేస్తాను, నాకు ముందు వున్న స్పీకర్సు చాలా పేరు ప్రతిష్టలు సంపాదించారు. నేను సక్సస్‌ఫుల్ స్పీకరు కావాలంటే, సక్సస్‌ఫుల్ స్పీకరుగా పేరు తెచ్చుకోవాలంటే అది నా చేతిలోలేదు. మీ మీద వుంది. ఎంతవరకు సక్సస్‌ఫుల్ చేయడానికి మీకు ఉత్సాహం వుందో అంతవరకు సక్సస్‌ఫుల్ అవుతాను. నేను తెల్ల కాగితములాంటి వాడిని, మీరు మంచి వ్రాస్తే మంచి వుంటుంది, చెడు వ్రాస్తే చెడు వుంటుంది. ఆ బాధ్యత మీకు వదలిపెడుతున్నాను. మీరు నా గురించి ఎన్నో మంచి విషయాలుచెప్పారు దానికి తగినా తగకపోయినా మీకు నా థ్యాంక్సు చెబుతూ సెలవు తీసుకుంటున్నాను.



శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి

07-09-1982 నుండి 16-01-1983

# శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి

శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి  ఆరవ శాసనసభ (1978-1983) స్పీకరుగా 1982వ సంవత్సరం సెప్టెంబరు 7వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1983వ సంవత్సరం జనవరి 16వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1934వ సంవత్సరం జూలై ఒకటవ తేదీన తిరుపతిలోని తుక్కివాకంలో జన్మించారు.  మద్రాసు క్రిస్టియన్ కాలేజీనుండి డిగ్రీ పట్టా పొందిన తరువాత మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో డబుల్ ఎమ్.ఎ., మద్రాసు లా కాలేజీలో ఎల్.ఎల్.బి., పిహెచ్‌డి పూర్తి చేశారు.

శ్రీ ఈశ్వం రెడ్డి  1967వ  సంవత్సరములో నాల్గవ  శాసనసభ,  1978వ సంవత్సరములో ఆరవ శాసనసభకు చిత్తూరు జిల్లా తిరుపతి నియోజకవర్గం నుండి శాసనసభ్యుడిగా ఎన్నికైనారు. వీరు 1980-1981 సంవత్సరాల మధ్యకాలంలో ప్రభుత్వ సంస్థల కమిటీకి అధ్యక్షునిగా పనిచేశారు. 1981-1982 సంవత్సరాల మధ్య కాలంలో డెప్యూటీ స్పీకరు హోదాలో అర్జీల,  విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా పనిచేశారు.

సభానిర్వహణ విషయంలో నియమ నిబంధనలను సమర్థవంతముగా అమలు చేసారు. సభ్యులు ప్రసంగాలు చేసే సమయంలో సంయమనం పాటించి, నిరాధారమైన ఆరోపణలు చేయరాదని పలు ప్రశస్తమైన రూలింగులను ఇచ్చారు.

వీరు ఆల్ ఇండియా పొలిటికల్ సైన్స్ అసోసియేషన్‌కు వైస్ ప్రెసిడెంట్‌గా, ఐ.ఐ.పి.ఎ. ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ స్టాండింగ్ కమిటి సభ్యునిగా, మాడభూషి అనంతశయనం ఇన్‌స్టిట్యూట్ అధ్యక్షులుగా ఉన్నారు. అంతేకాక ఎస్.వి. యూనివర్సిటీ సిండికేట్ సభ్యునిగా, ఆంధ్రప్రదేశ్ అగ్రికల్చర్ యూనివర్సిటీ మేనేజ్‌మెంట్ బోర్డు సభ్యునిగా, ఉస్మానియా యూనివర్సిటీ సెనేట్ సభ్యునిగా పనిచేశారు.

శ్రీ ఈశ్వర రెడ్డి యునైటెడ్ కింగ్‌డమ్, యురోప్, రష్యా, చైనా, అమెరికా దేశాలలో పర్యటించారు.

వీరు పేరుపొందిన రచయిత. "లోక్‌సభ ఎలక్షన్స్ ఇన్ 1977 అండ్ 1980 ఇన్ ఆంధ్రప్రదేశ్, ది ఎలక్టోరల్ రిఫామ్స్ ఇన్ ఇండియా, స్టేట్ పాలిటిక్స్ ఇన్ ఇండియా అండ్ హౌ హై ఈజ్ హైయర్ ఎడ్యుకేషన్ టుడే" పుస్తకాలను రచించి ప్రచురించారు. ది హిందూ, ఆంధ్రజ్యోతి, డక్కన్ క్రానికల్ మొదలైన వార్తా పత్రికలలో వ్యాసాలు రాస్తున్నారు.

శ్రీ ఈశ్వర రెడ్డి సేవలకు గుర్తింపుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రమశక్తి అవార్డు నిచ్చి సత్కరించింది.

## శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు, ప్రతిపక్ష నాయకులు, సోదర శాసనసభ్యులు, సోదరి శాసనసభ్యులు, అందరికి నా కృతజ్ఞతలు. మన పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో సభాపతి అంటే ఒక కీలకమైన పాత్రను నిర్వహిస్తాడనేది నిర్వివాదాంశం. అటువంటి వున్నత పదవికి నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకోవడం అంటే మీ అందరి మన్ననలను చూస్తే నాలో ఏమన్నా వున్నాయోమోననే సందేహం నాకే వస్తుంది. కాని యీ మన్ననలకు నాలో ఒకవేళ లేశమైన వుండదేమోగాని ఎక్కువగా నన్ను గురించి ప్రస్తుతించారు, నేను ఏదో పెద్ద మేధావిని అని పెద్ద న్యాయవాదిని అని కూడ కొంత మంది చెప్పడం జరిగింది. కాని ఒకటి మాత్రం చెప్పదలచుకున్నాను. I am only an Advocate on record. I did not practice. రూలింగ్ గురించి లేక దీని గురించి మీ తీర్పు ఏమని పెద్ద పెద్ద ప్రతిపక్షనాయకులు గద్దించి అడుగుతుంటే అదేదో కామన్ సెన్స్‌తో చెప్పడం జరుగుతుంది గాని పెద్ద లీగల్ ఎరుడిషన్‌తో చెప్ప లేదని మనవి చేస్తున్నాను. ఈ దినం ప్రతిపక్షనాయకులతో పాటు అందరూ నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారంటే నాకు ఎంతో హర్షదాయకంగా వుంది. ఇంకొక విషయం ఏమంటే యిక్కడ యీ సభలో నాకన్న దిట్టలు, మిన్నలు ఎందరో వున్నారని నాకు బాగా తెలుసు, వారికి ఆ అవకాశంరాలేదు, అదేదో నాకు కలిగింది అంటే అది నాఅదృష్టం అని చెప్పాలి. ఏదో ప్రతిభావంతుడిగా విధి నిర్వహణలో సరిగా చేస్తున్నారని యిన్నాళ్లు యాజ్ ఎ డిప్యూటీ స్పీకరు, యాక్టింగు స్పీకరు మీరందరు అనుకుంటే అదేదో మీరు యిచ్చిన సహకారం వల్లనే, ఆవేశపూరితంగావున్న సమయములో, కోపోద్రిక్తులై వున్న సమయములో ఏదో నాకు తోచిన రీతిగా మిమ్ములను నవ్వించి లేక మీ మనస్సును కష్ట పెట్టి ఎట్లాగో అట్లా అటు యిటు తర్జనభర్జలనకు తావు యిస్తూ చమత్కారంగా తీసుకువెళ్లాను, అది మీరు యిచ్చిన పట్టువల్ల జరిగింది. నాకేదో తెలిసి ప్రతిభావంతంగా చేశానని కాదు. మన్ననలను కురిపించి ప్రశంసించారు. మంచిదే, కాని ప్రశంసించిన తరువాత దీనివల్ల రేపు మీకు ఏదైనా కొంత కాలవ్యవధి యిస్తాననేది కూడ లేదు. శాసనసభ అఖరు

రోజులు, సభాపతి గురించి ఏదో చెప్పాము. పది నిమిషాలు అదనంగా దొరుకుతుంది అనుకోవచ్చు కొంత మంది, అది కూడ లేదు.

ఎవరు మాట్లాడలేదో మొదట వారికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. Particularly, I am grateful to you all, all the Legislators. యీ వైపున ఆ వైపున వున్నవారందరు నా సహోదరులు, సహోదరీమణులు, మీరందరు చేయూత యిచ్చి నా విధి నిర్వహణలోతోడ్పడ్డారు, మీ అందరికి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను, ముఖ్యంగా దాసుగారు ఒక మాట చెప్పారు. మా చిత్తూరు జిల్లా నుండి రామకృష్ణం రాజుగారు వచ్చారు, శాసన మండలికి అధ్యక్షులు అయ్యారు. 550 పైగా సభ్యులుండే లోకసభలో అనంతశయనం అయ్యంగారు డిప్యూటి స్పీకరుగా వుండి తరువాత స్పీకరు కావడం జరిగింది. అంటే ఒక ప్రసక్తి ఏమంటే కన్వెన్షన్ ప్రకారం డిప్యూటి స్పీకరుగా వున్నవారిని స్పీకరు స్థానానికి ఖాళీ ఏర్పడినప్పుడు హుందాతనం పెంచడానికి ఎలివేట్ చేయడం జరుగుతుందని మనవి చేస్తున్నాను. అలాంటిదే నాకు ఒక అవకాశం దొరికింది. అది దురదృష్టమో అదృష్టమో చెప్పలేనుగాని అసెంబ్లీ కొనసాగితే మీ అందరి సహకారముతో హుందాతనంగా నడిపించేవాడిని. నాకు ఎంతో ఆహ్లాదంగా వుంది, నన్ను ఎంతో ప్రశంసించి మంచి మాటలు చెప్పారు, I am grateful to all the Hon. Members. I thank the Leader of the House. Leader of Opposition and our revered Chief Minister for conducting me to this August Chair after duly conducting the formality, which is an interesting relic of the past. పర్టిక్యులర్లీ ప్రొటెమ్ స్పీకరుగా మూర్తిరాజుగారు నాలుగవసారి ఎం.ఎల్.ఏ.గా వున్నారనుకుంటాను. నా ఎన్నికను యిక్కడ డిక్లేరు చేయడం అంటే ఆ భ్యాగం కూడ కలిగింది, వారు పితామహులుగా వుంటూ ఎన్నిక చేసినందుకు వారికి కూడ పర్టిక్యులర్లీ I am thankful to him. I express my greatful thanks and humble acknowledgements for, the high honour which was showered on me. I thank the people also who have congratulated me today. ఇంతకంటే చెప్పవలసింది ఏమీలేదు, ప్రతిపక్షాలతో స్వపక్షముతో ఫేర్‌గా వుంటాను అని చెప్పే మాట ఎప్పుడూ వుండే మాటే, ఎవరైనా నన్ను తప్పుగా భావించి నేను తీసుకున్న దృక్పధంవల్ల నొప్పించివుంటే వారందరూ నన్ను క్షమించాలని కోరుతున్నాను. కొన్ని సమయాల్లో యిక్కడికి వచ్చి యిది చెప్పండి అతనిని మాట్లాడేటట్లు

చేయండి అని కొంత రౌద్రాకారంగా వున్న సభలో ఆవేశ పూరితంగా జరిగి వుండవచ్చు. దానికి you have to execuse me ఆ మాటమీకు చెప్పిన పరిస్థితివుంది. అది నేను వుద్దేశ్య పూర్వకంగా చెప్పిన మాట కాదు అని మరొకసారి గౌరవ సభ్యులందరికి మనవి చేస్తున్నాను. నేను ఒక పార్టీకి గాని ఒక వ్యక్తికి గాని లోబడి పోయి ఏదో చేసిన కార్యక్రమం లేదు, ఈ సీటు మీద కూర్చునంతవరకు సరైన ధర్మబుద్ధితో "జస్టిస్ టు ఆల్" అనే పద్ధతిలో చేస్తాను అని మనవి చేస్తూ మీరు చూపిన ఆదరాభిమానాలకు మరొకసారి ధన్యవాదాలు తెలుపుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.



**శ్రీ తంగి సత్యనారాయణ**

18-01-1983 నుండి 28-08-1984

# శ్రీ తంగి సత్యనారాయణ

శ్రీ తంగి సత్యనారాయణ ఏడవ శాసనసభ (1983-1984) స్పీకరుగా 1983వ సంవత్సరం జనవరి 18వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1984వ సంవత్సరం ఆగస్టు 28వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1931వ సంవత్సరము సెప్టెంబరు 8వ తేదీన శ్రీకాకుళం జిల్లా కిళ్లిపాలెంలో జన్మించారు. విశాఖపట్నంలోని ఎ.వి.ఎల్. కాలేజీ నుంచి గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి బి.ఎల్. డిగ్రీలో పట్టభద్రులైనారు.

వీరు 1958వ సంవత్సరములో కిళ్లిపాలెం గ్రామ పంచాయతీకి సర్పంచ్‌గా పనిచేశారు. 1962వ సంవత్సరములో శ్రీకాకుళం జిల్లా పంచాయతీరాజ్ ఛాంబర్ ఛైర్మన్‌గా పనిచేశారు. వీరు శ్రీకాకుళం వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు అధ్యక్షులుగా 1975 నుండి 1978 వరకు పనిచేశారు. 1975-1978 సంవత్సరాలలో ఎ.పి. స్టేట్ ఇరిగేషన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ డైరెక్టర్‌గా పనిచేశారు. 1982వ సంవత్సరములో శ్రీకాకుళం డిస్ట్రిక్ట్ బార్ అసోసియేషన్ అధ్యక్షులుగా పనిచేశారు.

శ్రీ సత్యనారాయణ 1967వ సంవత్సరము నాల్గవ శాసనసభకు, 1983వ సంవత్సరము ఏడవ శాసనసభకు శ్రీకాకుళం నియోజకవర్గం నుండి ఎన్నికైనారు.

వీరు శ్రీ నాదెండ్ల భాస్కరరావు మంత్రివర్గంలో 1984వ సంవత్సరము ఆగస్టు 28 నుండి 1984వ సంవత్సరము సెప్టెంబరు 15 వరకు రెవిన్యూ, భూసంస్కరణలు, రిజిస్ట్రేషన్ స్టాంపులు, జాగీర్ అడ్మినిస్ట్రేషన్, స్వాతంత్ర్య సమరయోధుల సంక్షేమం, సహాయ పునరావాసం, సర్వే సెటిల్‌మెంట్స్, ముఖ్యమంత్రి సహాయనిధి శాఖ మంత్రిగా పనిచేశారు.

శాసనసభలో జరిగిన చర్చలు ప్రజలకు యథాతథంగా చేరాలని శ్రీ తంగి సత్యనారాయణ అభిలషించేవారు. ప్రచార సాధనాలు ముఖ్యంగా వార్తా పత్రికలు రాజకీయ పరమైన, వ్యక్తిగతమైన రాగద్వేషాలకు అతీతంగా వ్యవహరిస్తూ సభాకార్యక్రమాలను నిష్పక్షపాతంగా ప్రజలకు అందించాలని వీరు 1983, సెప్టెంబరు 19వ తేదీన ఇచ్చిన రూలింగులో స్పష్టం చేశారు.

శ్రీ తంగి సత్యనారాయణ స్పీకరుగా శాసనసభ కార్యక్రమాలను సమర్థవంతంగా నిర్వహించారు.

## శ్రీ తంగి సత్యనారాయణ స్పీకర్‌గా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

స్నేహితులారా, ఈ ఏడవ శాసనసభ సభాధ్యక్షుడిగా నన్ను ఏకగ్రీవముగా ఎన్నుకొన్నందుకు గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారికి, ప్రతిపక్షనాయకులకు, గౌరవ సభ్యులందరకూ నా హృదయపూర్వక ధన్యవాదములు. నేను వినమ్రతతో, పవిత్ర హృదయముతో త్రికరణశుద్ధిగా ఈ బాధ్యతలను స్వీకరిస్తున్నాను. అనేక మంది మిత్రులు, విజ్ఞులు, ప్రాజ్ఞులు, చాలా సలహాలు, సూచనలు చేశారు. వాటన్నింటిని దృష్టిలో పెట్టుకొని సభాకార్యక్రమాలను నిర్వహిస్తాను అని సభ్యులకు హామీ యిస్తున్నాను. ప్రతిపక్షము, పాలకపక్షము అనే భేదము లేకుండా న్యాయము కలిగే పద్ధతిలో అందరికీ రక్షణ కల్పిస్తాను అని మనవిచేస్తున్నాను. నేను ఈ సభా కార్యక్రమాలను నిర్వహించటములో సభ్యులందరు తమ సహకారాన్ని యివ్వాలని మనవిచేస్తున్నాను. సభాకాలము చాలా అమూల్యమైనది. అనేక సమస్యలుంటాయి. మనకు వున్న సమయములో ఈ సమస్యలను ప్రభుత్వదృష్టికి తీసుకొనిరావడానికి వినియోగించుకోవడము మంచిదని భావిస్తున్నాను. ఆంధ్రుల అభ్యున్నతికి కృషి చేయాలని లక్ష్యములో ఎటువంటి సందేహము లేదు. ఏ పార్టీ వారైనా కాని వారి ప్రోగ్రామ్స్ ఏవైనా కాని లక్ష్యం ఒకటే. ఆంధ్రుల అభ్యున్నతికి అంకితము కావాలనే దృష్టితో వ్యవహరించాలని, ఆవేశాలకు తావు యివ్వక శాంతియుతమైన వాతావరణములో చర్చలు జరుపుకొని సమస్యలను పరిష్కరించుకొనడానికి ప్రయత్నము చేద్దాము. సభ్యులందరూ ఈ శాసనసభలో హుందాగా వ్యవహరిస్తారని ఆశిస్తున్నాను. సభా హుందాతనాన్ని కాపాడటానికి నేను ప్రయత్నము చేస్తాను. ఆంధ్రప్రదేశ్ విధానసభకు ఒక ప్రత్యేకత వుందని గౌరవనీయులైన అనేకమంది పెద్దలు చెప్పివున్నారు. హుందాతనముగా ఇంతకుముందున్న సభాధ్యక్షులు సభా కార్యక్రమాలను నిర్వహించిన మాదిరే నేను కూడ సభ హుందాతనమును మెయింటెయిన్ చేస్తానని మనవి చేస్తున్నాను. శాసన సభ్యులు కూడ తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తే సభా కార్యక్రమాలు సాఫీగా సాగుతాయి, ధర్మో రక్షతి రక్షిత: ఏ ధర్మము రక్షించబడుతుందో అదే ధర్మము మనలను రక్షిస్తుంది. శాసన సభ్యులు తమ తమ విద్యుక్త ధర్మమును నిర్వహించిననాడు అదే ధర్మము మనందరను రక్షిస్తుందని తెలియజేస్తూ మీ అందరకు నా ధన్యవాదాలు మరొకసారి తెలియజేస్తూ శలవు తీసుకుంటున్నాను.



శ్రీ నిశ్శంకరరావు వెంకటరత్నం

20-09-1984 నుండి 10-01-1985

# శ్రీ నిశ్శంకరరావు వెంకటరత్నం

శ్రీ నిశ్శంకరరావు వెంకటరత్నం ఏడవ శాసనసభ (1983-1984) స్పీకరుగా 1984వ సంవత్సరం సెప్టెంబర్ 20వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1985వ సంవత్సరం జనవరి 10వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1927వ సంవత్సరము జూన్ 17వ తేదీన గుంటూరు జిల్లాకు సమీపంలోని ఏటుకూరు గ్రామంలో జన్మించారు. గుంటూరులోని ఎ.సి. కాలేజిలో బి.ఎ. డిగ్రీని, మద్రాసు లా కాలేజి నుండి లా డిగ్రీని పూర్తి చేసి న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు.

శ్రీ వెంకటరత్నం 1972వ సంవత్సరములో ఐదవ శాసనసభకు, 1983వ సంవత్సరములో ఏడవ శాసనసభకు గుంటూరు-2 నియోజకవర్గం నుంచి విజయం సాధించారు.

వీరు 1983-1984 సంవత్సరాల మధ్య కాలంలో ప్రభుత్వ సంస్థల కమిటీ అధ్యక్షునిగా పనిచేశారు. 1985వ సంవత్సరములో జరిగిన పార్లమెంట్ ఎన్నికలలో తెనాలి నియోజవర్గం నుంచి లోకసభకు ఎన్నికైనారు. శాసన సభ్యుడిగా, పార్లమెంట్ సభ్యుడిగా శ్రీ వెంకటరత్నం రాష్ట్ర ప్రజలకు చేసిన సేవలు చిరస్మరణీయమైనవి.

వీరు 2004వ సంవత్సరం ఆగస్టు 6వ తేదీన మరణించారు.

## శ్రీ నిశ్శంకరరావు వెంకటరత్నం స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

తెలుగుదేశం నాయకులు శ్రీ ఎన్.టి. రామారావుగారు, మిత్ర పక్షాల నాయకులు అందరూ నాపట్ల వెలిబుచ్చిన అభిప్రాయాలకు నా కృతజ్ఞతను తెలియజేస్తున్నాను. మీరంతా నామీద ఉంచిన నమ్మకానికి న్యాయం కలగజేస్తాను. ప్రజలు మనలనుంచి చాలా విషయాలను ఎదురు చూస్తున్నారనుకొంటున్నాను. ఉన్నత ప్రమాణాలను నిలబెడతామని ప్రజలు మనలను సభ్యులుగా గెలిపించారు. వారి ఆశలు వమ్ముకాకుండా ఆ ఉన్నత ప్రమాణాలను నిలబెట్టడానికి మీ అందరి సహకారముతో కృషిచేస్తానని ~~ఈ~~ శుభసమయంలో మనవి చేస్తున్నాను. నామీద వుంచిన నమ్మకమును నిలబెట్టడానికి కృషిచేస్తాను. ఇక్కడున్న మిత్రులకు, ఇక్కడలేని మిత్రులకు ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.



**శ్రీ జి. నారాయణ రావు**

12-03-1985 నుండి 26-09-1989

# శ్రీ జి. నారాయణరావు

శ్రీ జి. నారాయణరావు ఎనిమిదవ శాసనసభ (1985-1989) స్పీకరుగా 1985వ సంవత్సరం మార్చి 12వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1989వ సంవత్సరము సెప్టెంబరు 26వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1931వ సంవత్సరము జూన్ 24వ తేదీన కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూకా తిమ్మాపూర్ గ్రామంలో జన్మించారు. వీరు 1959లో గ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన తరువాత ఉస్మానియా యూనివర్సిటీ నుండి లా డిగ్రీ పూర్తి చేశారు.

శ్రీ నారాయణరావు ఆంధ్రప్రదేశ్ బార్ కౌన్సిల్‌కు మూడుసార్లు వైస్ ఛైర్మన్‌గా, సిటీ సివిల్ కోర్ట్‌ల బార్ అసోసియేషన్ ఛెర్మన్‌గా పనిచేశారు.

1985వ సంవత్సరం ఎనిమిదవ శాసనసభకు రాజధానిలోని మహరాజ్‌గంజ్ నియోజకవర్గం నుంచి ఎన్నికైనారు. 1985వ సంవత్సరంలో కెనడాలో జరిగిన కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ సదస్సులో పాల్గొన్నారు.

శాసనసభ హక్కుల విషయంలో శ్రీ జి. నారాయణరావు నిక్కచ్చిగా వ్యవహరించే వారు. సభామర్యాద ఉల్లంఘన విషయంలో రాజీపడేవారు కాదు. భారత రాజ్యాంగం శాసనసభకు, న్యాయవ్యవస్థకు సంబంధించి స్పష్టమైన అధికార విభజన చేసిందని, ఒకరి అధికార పరిధిలోనికి ఇంకొకరు ప్రవేశించడం ఇరువురికి మధ్య ఉన్న సత్సంబంధాలను దెబ్బ తీసుకోవడమే అవుతుందని, చట్టసభల గౌరవ ప్రతిష్ఠలకు భంగం వాటిల్లినప్పుడు వాటిని ఏ విధంగా పరిరక్షించుకోవాలనేది చట్టసభల పరిధిలోని అంశమని ఈ విషయంలో ఏ న్యాయస్థానం జోక్యం చేసుకునే వీలు లేదని స్పష్టం చేస్తూ 1989 వ సంవత్సరం సెప్టెంబర్ 14వ తేదీన రూలింగు ఇచ్చి శాసనసభ గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింప జేశారు.

శాసనసభ హక్కుల గౌరవ పరిరక్షణలో ఎటువంటి ఒత్తిడులకు లొంగకుండా సాహసంతో వ్యవహరించిన శ్రీ నారాయణరావు భావి తరాలకు ఆదర్శప్రాయులు.

# శ్రీ నారాయణరావు స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

నేను ఏకగ్రీవంగా ఎన్నికయినందుకు నాకు కృతజ్ఞతలు తెలియజేస్తూ, ప్రతిపక్ష సభ్యులు, ఇతర సభ్యులందరు నన్ను ఎంతయో ప్రశంసించారు. కొందరు కొన్ని సూచనలు కూడా చేశారు. వారందరికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తూ, సభా సాంప్రదాయాలను తప్పకుండా దృష్టిలో ఉంచుకొని చూడవలసిన అవసరం బాధ్యత నామీద వుంది. మీరందరితో నేను గుర్తుచేయవలసింది ఏమిటంటే ఆగస్టు, సెప్టెంబరులో జరిగిన సంఘటన ఒక పీడకలగా హరించిపోవలెను, అటువంటిది ఇకమీదట జరగకుండా చర్యలు తీసుకుంటానని హామీ ఇస్తున్నాను. సభ్యులకు సరియైన సమయం దొరకకపోవడం అసెంబ్లీలో వుంది, పార్లమెంటులోనూ వుంది. మీరు పబ్లిక్ రెప్రజెంటెటివ్స్, మీ పర్ఫామెన్స్ ఆరుకోట్ల ప్రజానీకము చూస్తూ వుంటుంది. ప్రజా శ్రేయస్సుకొరకు, ప్రజలకు మంచి జరిగే విషయంలో దానికి మనము ఎక్కువ టైం తీసుకొని చర్చకు తీసుకొని వస్తాము. అయితే గౌరవ సభ్యులందరి కోపరేషన్ ఎంతయినా అవసరము. సభ యొక్క డిగ్నిటీ, డెకారమ్ దిగజారకుండా చూడడం సభ్యులందరి ప్రథమ కర్తవ్యం. మీ అందరితో మనవి చేసేది ఏమిటంటే సభాకార్యక్రమం, సక్రమంగా ఉండాలి, చట్టబద్ధంగా వుండాలి. టైం మాత్రం ప్రతి సభ్యుడికి దొరుకుతుంది. నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నందుకు మరొక్కసారి కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

# శ్రీ పి. రామచంద్రా రెడ్డి

శ్రీ పి. రామచంద్రా రెడ్డి తొమ్మిదవ శాసనసభ (1989-1994) స్పీకరుగా 1990వ సంవత్సరం జనవరి 4వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1990వ సంవత్సరం డిసెంబరు 22వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు. వీరు స్పీకరుగా ఉన్నపుడే లైబ్రరీ కమిటీకి కొంతకాలం ఛైర్మన్‌గా పనిచేసారు.

వీరు 1929వ సంవత్సరము డిసెంబరు 3వ తేదీన మెదక్ జిల్లాలోని సంగారెడ్డిలో జన్మించారు. ఉస్మానియా యూనివర్సిటీలో బి.ఎ., ఎల్.ఎల్.బి., వరకు విద్యాభ్యాసం చేసారు. వీరు కొంతకాలం న్యాయవాదిగా ప్రాక్టీసు చేసారు.

శ్రీ రామచంద్రా రెడ్డి పటాన్‌చెరు పంచాయతీ సమితి అధ్యక్షునిగా, ఎ.పి. ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛెర్మన్‌గా, ఎ.పి.ఎస్.ఆర్.టి.సి. పాలకవర్గ సభ్యులుగా పనిచేశారు.

1962వ సంవత్సరములో మూడవ శాసనసభకు, 1972వ సంవత్సరములో ఐదవ శాసనసభకు, 1983వ సంవత్సరములో ఏడవ శాసనసభకు, 1985వ సంవత్సరములో ఎనిమిదవ శాసనసభకు, 1989వ సంవత్సరములో తొమ్మిదవ శాసనసభకు మెదక్ జిల్లా సంగారెడ్డి నియోజకవర్గం నుండి ఎన్నికైనారు.

శ్రీ రామచంద్రా రెడ్డి శ్రీ నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి మంత్రి వర్గంలో 22.12.1990 నుండి 08.10.1992 వరకు భారీ పరిశ్రమల మంత్రిగా పనిచేసి చక్కని పాలనాదక్షుడుగా పేరు పొందారు.

వీరు స్పీకరుగా శాసనసభ కార్యకలాపాలను ఎంతో సమర్థవంతంగా నిర్వహించారు.

శాసనసభ స్వయం ప్రతిపత్తి మరియు సభ్యుల విశేషాధికారాల గురించి విశేషంగా కృషి చేశారు. ఈ విషయంలో వీరు అత్యంత కీలకమైన రూలింగులను ఇచ్చారు.

## శ్రీ రామచంద్రా రెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

దయచేసి అవకాశం యివ్వని వారు క్షమించాలని, సమయం ఇవ్వలేదు, కఠినుడు అని భావం పెట్టుకోవద్దని మనవి చేస్తున్నాను, యింతకంటే ఎక్కువ సమయం ఏ స్పీకరు ఇవ్వరు. మీరు అంతా సమిష్టంగా సభను జయప్రదంగా నడపాలని అందరూ ఆశిస్తూ మాట్లాడినారు. నేను కూడా సాంప్రదాయంగా కొన్ని విషయాలు చెప్పదలచు కున్నాను. ఇండివిడ్యుయల్‌గా కాకుండా మీరు అంతా సమిష్టిగా చెబితే బాగుంటుంది, ఎవరైతే ఉపన్యాసము యిచ్చి సలహాలు యిచ్చినారో వాటిలో అర్థమైనటువంటివి ఉన్నాయో వాటిని తీర్చడానికి ప్రయత్నంచేస్తాను. మాట్లాడిన వారికి మాట్లాడని వారికి కూడా సమిష్టిగా అభివందనలు తెలుపుకుంటున్నాను. భారతదేశములో ఆంధ్రప్రదేశ్ శాసనసభ ప్రతిష్ట పెంచడానికి మీ అందరి సహాయ సహకారాలను తీసుకుని పెంపొందించడానికి తప్పకుండా ప్రయత్నిస్తాను. ముఖ్యంగా సభానాయకులు, ప్రధాన ప్రతిపక్ష నాయకులు, అందరు ప్రతిపక్షనాయకులు, గౌరవ సభ్యులు నాకు ఈ స్పీకరు పదవి అవకాశం కల్పించారు. ముఖ్యంగా ముఖ్యమంత్రి, ఫ్లోరు లీడరు డాక్టరు చెన్నారెడ్డిగారిని, ప్రధాన ప్రతిపక్ష నాయకులు శ్రీ ఎన్.టి. రామారావుగారిని, తతిమా అందరు ప్రతిపక్ష నాయకులను, గౌరవ శాసనసభ్యులను, నాకు ఈ అవకాశం యిచ్చినందులకు హృదయ పూర్వకంగా అభినందనలు తెలుపుకుంటున్నాను. నేను నిజంగా సీనియరు మెంబరునే. నన్ను ఎవరు పదవిపైన చేయరని నమ్మి, నిరాశబడి ఇక ఏ పదవి రాదని గత శాసనసభలోనే రిటైరు కావాలనుకున్నాను. ఈసారి రిటైరు కావాలనుకున్నాను. తమరు తప్పుగా అర్థము చేసుకోకుండా ఉంటే డాక్టరు చెన్నారెడ్డిగారు నేను విద్యార్థిగా ఉన్నప్పుడు వారు నా నియోజకవర్గానికి ప్రాతినిధ్యము వహించారు. వారు అప్పుడు ప్రాతినిధ్యము వహించిన నియోజకవర్గానికి నేను యిప్పుడు ప్రాతినిధ్యము వహిస్తున్నాను. నేను చిన్నప్పుడే విద్యార్థిగా ఉన్నప్పుడే శ్రీ రామానందతీర్థ, శ్రీ రామకిషన్‌రావుగారు, శ్రీకొండా వెంకటరంగారెడ్డిగారి ఆధ్వర్యములో ఆ పార్టీలో ఉండిన వాడిని తరువాత స్పెషల్‌గా చెన్నారెడ్డిగారి ఆధ్వర్యంలో ట్రైన్ అయినవాడిని. వారు నిలబడమంటే నిలబడి వచ్చినాను. నాకు ఏ పదవీ

రాదనుకున్నది కాంగ్రెసు పార్టీ నన్ను స్పీకరుగా ఎన్నిక చేసి ఏ పదవీ రాదనుకున్న నమ్మకాన్ని బ్రేక్ ఆఫ్ చేసినారు, వారికి, వారి పార్టీ సభ్యులకు ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. చరిత్రాత్మకంగా అన్ని పార్టీలు, తమరు ప్రధాన ప్రతిపక్ష నాయకులు, ప్రతి పక్ష నాయకులు, నాపేరును ప్రతిపాదించి నందుకు వారందరికి ప్రత్యేకంగా అభినందనలు తెలుపు కుంటున్నాను. ఈ శాసనసభను మీరు ఎట్లాగయితే ఎక్స్‌పెక్టు చేస్తున్నారో ఆ విధంగా తప్పకుండా నడుపుతానని హామీ యిస్తున్నాను. నాకు ఉన్న అనుభవం నాకంటే యింకా ఎక్కువ అనుభవం కలిగినటువంటి సభానాయకులు, ప్రతిపక్షనాయకులు ఉన్నారు. నా విధిలో మీ అనుభవాలు తప్పకుండా తోడ్పడుతాయని ఆశిస్తున్నాను. మీ అనుభవాలతో మన సమస్యలను ముందుకు తీసుకుని పోయి రాష్ట్రాన్ని చక్కగా ప్రజానీకం అశించిన విధంగా తీర్చి దిద్దడానికి శాసన సభాపతిగా నేను ప్రయత్నం చేస్తానని మీకు వాగ్దానము చేస్తున్నాను. అయితే శాసనసభ డ్యూటీ చాలా చిక్కుతో కూడుకున్నది. ప్రప్రధమంగా నేను డిసిప్లిన్ గురించి యిదివరలో చాలా సార్లు ప్రయత్నం చేస్తూ వచ్చాను. నేను రెండు సార్లు ఓడిపోయాను, అయిదు సార్లు గెలిచాను శాసనసభకు రావడానికి. గెలిచినప్పుడల్లా, ఇక్కడకువచ్చి, డిసిప్లిన్ చాలా ముఖ్యమైనదని తోటి సభ్యులతో కోరేది ఎంత ఎగ్జయిట్‌మెంట్ వున్నా ఓపికతో దాన్ని సరిదిద్దే ప్రయత్నము చేసేది. అది నా సౌభాగ్యము. ప్రతిసారి ఎంత ఎగ్జయిట్‌మెంట్ వున్న సభ్యుడు కూడా 25 ఏండ్లలో నేను చెప్పే మాట విని, సభను అర్డరులోకి తెచ్చి, మరల ప్రోసీడింగ్స్ జరిగేవి. ఆ న్యాక్‌ని గాని, లేక ఆ అనుభవాన్నిగాని ఇక్కడ సంపూర్ణంగా వాడుకొని, ఈ హౌస్‌ను ఆర్డరులో పెట్టడానికి ప్రయత్నించి, జయప్రదంగా నడుపుతానని నాపై నాకు నమ్మకం సెల్ఫ్ కాన్ఫిడెన్స్ వుంది. దాన్ని తప్పకుండా నెరవేర్చగలుగుతాను. అసెంబ్లీ విషయంలోగాని, పార్లమెంట్ విషయంలోగాని, మన బ్రిటిషు సంప్రదాయం వెనుకటి స్పీకర్ విషయం హౌస్ ఆఫ్ లార్డ్సులో క్వీన్ ఎలిజబెత్‌గారు వచ్చినప్పుడు, అప్పటి ఛాన్సలర్ ఏమన్నారంటే కొత్తగా ఎన్నికయిన హౌస్ ఆఫ్ కామన్స్ సభ్యులను గురించి Go and assemble yourself to elect a learned man to be your Speaker. ఇది నేను వైజ్ మ్యాన్ అని కాదు కానీ, మీ అందరికి అక్కడ ఇంగ్లండులో ఎట్లా అయితే ఆదేశాలిచ్చారో, అనుకోకుండా ఫ్లోర్ లీడరు గారు నాపేరు చెప్పడం, మీరందరూ స్పాంటేనియస్‌గా అంగీకరించడం వల్ల, నాపైన బాధ్యతలు పెరిగిపోయాయి. నేను తప్పనిసరిగా

నిష్పక్షపాతంగా ఈరూల్సులో ఏమి వ్రాశారో, ఈ రూల్సు ప్రకారం అక్కడ ఏ ట్రెడిషన్ డెవలప్ చేశామో, ఆ ట్రెడిషన్ ప్రకారం సభను తప్పకుండా, జరిపిస్తానని మనవి చేస్తున్నాను. పోతే హౌస్ ఆఫ్ కామన్స్‌లో స్పీకరు అంటాడు. It is Mr. Lenthall in 1642-I have neither eyes to see nor tongue to speak in this palce, but the House is pleased to direct me whose servant I am here, కనుక మీరు చెప్పింది నేను పాటించడంగాని, నేను చెప్పింది మీరు పాటించడం అనే సమస్య వుండదు. ఎక్స్ప్లు ఇండిసిప్లిన్, డిసార్డరు తక్కినవన్నీ ఏది చేసినా నాకు స్టాట్యుటరీ రైట్స్ లేవు, కానిస్ట్యూషనల్ రైట్స్ లేవు. దానికొక చాప్టర్ లేదు, ఏమి చేసినా ఈ హౌస్‌ను అడిగి, హౌస్ సమ్మతితోనే చేసేది వుంది. ఎప్పుడు కూడా నా డైరెక్షన్ అనేది వుండదు. కనుక ఇదే మదర్ పార్లమెంటులో చెప్పబడ్డది. నేను కాంగ్రెసు సభ్యుడిని. నేను ఇండిపెండెంటుగా నిలబడ్డా అప్పుడున్న సభ్యులందరకు తెలుసు. నేను కాంగ్రెసు పార్టీ వాణ్ణి. వాళ్లకు అవసరం లేదని అంటే మేము పదకొండు మంది సభ్యులము - అప్పుడున్న సభ్యులకు తెలుసు. ఇక్కడే కూర్చున్నామని చెప్పాము. అయితే ఆ పార్టీని వదలాలి కదా అని కొందరు స్నేహితులు అడిగారు. దీనికి సంబంధించి, ప్రప్రథమమైన స్పీకరు మౌలంకర్‌గారు పార్లమెంటులో ఆయనను ఇదే సమస్యపై అడిగినప్పుడు, ఆయన ఈ విధంగా చెప్పారు. "It is obviously not possible in the present conditions of our political and parliamentary life to remain as insular as the English Speaker so far as the political life goes. But, the Indian Speaker, acting as such, will be obsolutely a non-party man meaning thereby that he keeps aloof from party deliberations and controversies. He does not cease to be a politician merely by the fact of his being the Speaker. We have yet to evolve political parties and healthy conventions about the Speakership. The principle today that once a Speaker, he is not opposed by any party in the matter of his election, whether in the Constituency or in the House so long as he thinks to continue as Speaker. To expect a Speaker to be out of politics altogether without the corresponding convention is perhaps entertaining contradictory expectations. Though a Congress man, it would be my duty and efforts to deal with all Members and sections of the House with justice and equality. It would be my duty to be impartial and remain above all considerations of party or political career." He further said: ' I may mention here the necessary counterpart of this convention. It is that the Speaker has to obstain from active participation in all controversial topics or politics. The essence of the matter is that the

Speaker has to place himself in that position of a Judge. He is not to become a partisan so as to avoid unconscious bias for against a particular view and thus inspire confidence in all sections of the House about his integrity and impartiality. If we are able to build up this convention on our own, then only we shall be able to justify in course of time the other one about the Speaker's seat being uncontested. ఈ విధంగా ఇది మొదటిసారి కాదు, ఒక రాజకీయ పార్టీలో వుండి కూడా తాను కాంట్రోవర్సియల్ ఇస్యూలో తప్పుకొని, పార్టీని బిల్డప్ చేయడానికి పార్టిసిపేట్ కావడంలో తప్పులేదు. కనుక కాంగ్రెసు పార్టీకి గాని, ఏ పార్టీకి నేను సంబంధించిన వాణ్ణి అయినా, రాజీనామా ఇవ్వవలసిన అవసరంలేదు. గైడ్‌లైన్స్ ప్రకారం నేను తప్పకుండా పని చేస్తానని వాగ్దానము చేస్తూ, మీరు సంపూర్ణ సహకారము ఇస్తారని, మొత్తము భారతదేశములో ఒక ఆదర్శవంతమైన హౌస్‌గా కావలెనని నా అభిలాష, మీ అందరి కోరికపై నేను అంగీకరించాను. మీ అందరి సంపూర్ణ సహకారముంటే, ఇంకా చాలా విషయాలున్నాయి, చాలా మంది యువకులు వచ్చారు. రేపు చాలా బాధ్యతలు మీపై వుంటాయి, మీరు చాలా విషయాలు నేర్చుకోవలసి వుంటుంది, నేను శాసన సభ్యుడిగా ఏ పార్టీ యువకులైనా, గత 5 సంవత్సరాలలో చాలా విషయాలలో నేను కూర్చొని చర్చించి ట్రెయినింగ్ పొందాను. హౌస్ ప్రోసీజరును తెలుసుకోవలెను. ఆ తరువాత ఏ హక్కులున్నాయో తెలుసుకోవలెను. ఏ విధంగా నోటీసు ఇవ్వాలి, ఏ విధంగా ఎజెండాలోకి నోటీసులు వస్తాయి. ఇవన్నీ తెలుసుకొనేది వుంది. రూల్సు లేకుండా అడగడం న్యాయం కాదు.

హౌస్‌లో అప్పుడప్పుడు కొంత అల్లరి అవసరమే. ఎందుకంటే, ప్రెస్ వారికి బోర్ అయిపోతుంది. అయితే రోజూ అదే పని పెట్టుకుంటే, వారు కూడా వ్రాయరు, అప్పుడప్పుడు కొన్ని ఎమోషన్స్ ఇస్యూస్ వుంటాయి. దయచేసి, దాన్ని మనము కొంతసేపు టాలరేట్ చేసినా, డిసిప్లిన్ కొరకు ప్రయత్నం చేయడంలో సభ్యులందరూ సహకరిస్తారనే నమ్మకము నాకుంది. ప్రెస్ వారితో నాదొక రిక్వెస్ట్. మంచి డెలిబరేషన్స్ కూడా ఎకనామికల్ ప్రాబ్లమ్స్ వున్నాయి మనకు. దాని మీద గౌరవ సభ్యులు ఎవరయినా మంచిగా మాట్లాడితే అది పేపర్లో వచ్చి, సామాన్య జనానికి చేరితే, న్యూస్‌ని కంట్రిబ్యూట్ చేయడంలో ప్రభుత్వము లేక శాసనసభ ఏ విధంగా యోచిస్తున్నదని అనడంలోనూ, రిసోర్సెస్ పెంచడంలో మనము ఏవిధంగా కృషి చేస్తున్నాము అని అనడంలోనూ ప్రజలకు చాలా

తోడ్పడుతుంది. అది మానివేసి, బ్యాడ్ యాస్పెక్ట్స్‌ని ఎక్కువగా ఫోకస్ చేస్తే, అది చదివిన వారికి అంత వుపయోగముండదని నా వ్యక్తిగత భావన. చాలా విషయాలు కరెక్టుగా చేస్తారు ప్రెస్ వాళ్లు. కాని ఇదొకటి, నా మనస్సులో వున్నది చెప్పకతప్పదు, శాసనసభలోపలగాని, బయటగాని, మన సభా నాయకులన్నారు, శాసన సభ్యుడిని అందరూ గౌరవించవలసిందే. మనము కూడా మన పరిధిలోపల వుండవలసిందే. గౌరవించనప్పుడు, ఎవరినైనా క్షమించేది లేదు. నాతో మీరు అందరూ ఏకీభవిస్తారని, అటువంటివి ముఖ్యమంత్రిగారికి గాని సంబంధిత మంత్రిగారికి గాని వచ్చినట్లయితే, ఆ విషయం పై వెంటనే చర్య తీసుకోవడం జరుగుతుంది. ఈ సభలోకి రాగానే దేశం, ప్రజలము అని మనము భావిస్తే ఏ చిక్కు సమస్యారాదు, రూల్సు బుక్ తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ తయారైవుంది. సభ్యులు వెంటనే దాన్ని థరోగా చదవాలి. మంచి డిబేట్స్ చేయండి. మంచి విషయాలు మాట్లాడే వారిని ఆపము. ఏదయినా మనం మట్లాడేటప్పుడు, మననోటి నుండి మాట వెళ్లక ముందు ఇతరులను ఆల్లరి చేసే పద్ధతికి పోకూడదు. ఈ అసెంబ్లీ చాలా సాంప్రదాయంగా నడచిన అసెంబ్లీ. దేశములో ఇతర ఆసెంబ్లీల వలె అంత చెడ్డ పేరు తెచ్చుకోలేదు. ఎప్పుడు కూడా. అక్కడక్కడ ఎమోషన్స్ తప్ప, అసెంబ్లీ చెప్పకోదగ్గ చెడ్డపని చేయలేదు. నాకంటే వయస్సులో పెద్ద వారు వున్నారు మీకు ఏ సమస్య వున్నా, హౌస్‌లో రెయిజ్ చేయడం కంటే, బి.ఎ.సి.లో మీ నాయకులున్నారు, వారి ద్వారా చెప్పి, చేస్తే హౌస్ చాలా స్మూత్‌గా నడుస్తుంది. అట్లా కాకుండా ఇక్కడ రెయిజ్ చేస్తే, ఇబ్బందిగా వుంటుంది. అక్కడ బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీలో ఏమీ రైజ్ చేయకుండా ఇక్కడ ఈ సభలో పాయింట్లు రైజ్ చేస్తే చాలా యిబ్బంది ఉంటుంది. నా కంటే చిన్నవారు యిక్కడ సభ్యులు నన్ను అభినందించారు. పెద్దవారైన సభ్యులు నన్ను ఆశీర్వదించారు. ఈ విధంగా యిక్కడ అందరు సభ్యులు నన్ను సుహృద్భావంతో ఆశీర్వదించినందుకు గుడ్ విషెస్ చెప్పినందుకు వారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.



శ్రీ డి. శ్రీపాద రావు

19-08-1991 నుండి 11-01-1995

# శ్రీ దుద్దిళ్ళ శ్రీపాదరావు

శ్రీ దుద్దిళ్ల శ్రీపాదరావు  తొమ్మిదవ శాసనసభ (1989-1994) స్పీకరుగా 1991వ సంవత్సరము ఆగస్టు 19వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 1995వ సంవత్సరము జనవరి 11వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు. వీరి హయంలో 1993-94వ సంవత్సరంలో మొదటి సారిగా మహిళా శిశు సంక్షేమ కమిటీని ఏర్పాటు చేసారు.

వీరు 1939వ సంవత్సరం నవంబరు 6వ తేదీన కరీంనగర్ జిల్లా మంథని గ్రామంలో జన్మించారు.

వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎల్.ఎల్.బి. పూర్తిచేశారు. 1958-1960 సంవత్సరాల మధ్యకాలంలో ఆదిలాబాద్ జిల్లా ఖానాపూర్ పంచాయతీ సమితి ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్‌గా పనిచేస్తూ, ఉద్యోగానికి రాజీనామా చేసి రాజకీయాలలో చేరారు. 1964లో ధన్వాడా గ్రామ పంచాయతీ సర్పంచ్‌గా, 1965-1969 సంవత్సరాల మధ్య కరీంనగర్ డిస్ట్రిక్ట్ లైబ్రరీ అథారిటీ సభ్యునిగా, 1965 నుండి 1983 వరకూ మంథని వ్యవసాయాభివృద్ధి బ్యాంకు అధ్యక్షునిగా, 1980 నుండి 1985 వరకూ మహాదేవపూర్ పంచాయతీ సమితి ఉపాధ్యక్షునిగా, ధన్వాడా కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ అధ్యక్షునిగా, టుబాకో బోర్డు మెంబరుగా పనిచేశారు.

శ్రీ శ్రీపాదరావు 1983వ సంవత్సరంలో ఏడవ శాసనసభకు, 1985వ సంవత్సరములో ఎనిమిదవ శాసనసభకు, 1989వ సంవత్సరంలో తొమ్మిదవ శాసనసభకు కరీంనగర్ జిల్లా మంథని నియోజవర్గం నుండి శాసనసభ్యుడిగా ఎన్నికైనారు. గ్రంథాలయ కమిటీ, ప్రభుత్వ హామీల కమిటీ మరియు అంచనాల కమిటీలలో సభ్యునిగా ఉన్నారు.

వీరు న్యూఢిల్లీలో 1991వ సంవత్సరములో జరిగిన  కామన్‌వెల్త్  పార్లమెంటరీ సమావేశంలోనూ, 1992వ  సంవత్సరములో జరిగిన అఖిల భారత స్పీకర్ల సమావేశంలోనూ పాల్గొన్నారు.

శ్రీ శ్రీపాదరావుగారిని 1999వ సంవత్సరం ఏప్రిల్ పదమూడవ తేదీన నక్సలైట్లు కాల్చిచంపారు. వీరు చేసిన సేవలకు గుర్తింపుగా గౌరవ భావంతో కరీంనగర్ జిల్లాలోని ఎల్లంపల్లి ఎత్తిపోతల పథకానికి వీరి పేరు పెట్టడం జరిగింది.

వీరు శాసనసభ స్పీకరుగా మృదు స్వభావంతో వ్యవహరించి అందరి మన్ననలను పొందారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలకే సార్వభౌమాధికారం ఉంటుందని, ప్రజలు ఆ అధికారాన్ని చట్టసభల సభ్యుల ద్వారా వినియోగించుకుంటారని, ప్రభుత్వ విధానాలు చట్టసభలలో జరిగే చర్చల ద్వారానే రూపొందుతాయని, ప్రభుత్వ విధానాల తీరు తెన్నులను తెలుసుకొనే అధికారం ప్రజాప్రతినిధులకు ఉంటుందని, కనుక ప్రజాప్రతినిధులను ప్రభుత్వ కార్యక్రమాలకు ఆహ్వానించడం ప్రభుత్వ అధికారుల కర్తవ్యమని, ఈ విషయంలో ప్రజాప్రతినిధుల ప్రాధాన్యతను తగ్గించివేయటం ఎంతమాత్రం సమర్ధనీయం కాదని శ్రీ డి. శ్రీపాదరావు 1994, మార్చి 15వ తేదీన రూలింగులో విశదం చేశారు.

## శ్రీ శ్రీపాదరావు స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

మీరందరు అభిమానంతో నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకున్నదానికి నా కృతజ్ఞతలు. ఇంకా చాల మంది పెద్దలు రజబలీగారు ఇతర పెద్దలు చాలా మంది మిగిలిపోయారు. ఇంక సమయం లేదు కాబట్టి ఇంకా మీ అందరికి సమయం కేటాయించనందుకు క్షమించమని కోరుతూ ఉన్నాను. ముఖ్యమంత్రిగారు ఎప్పుడైతే నా పేరు ప్రతిపాదించి నన్ను నామినేషను వేయాలి అని అన్నారో అప్పుడే మెయిన్ అప్పొజిషన్ లీడర్సు, ఫ్లోర్ లీడర్సు, అప్పొజిషన్ మెంబర్లు మాతోటి కాంగ్రెసు శాసనసభ్యులు అందరు సహకరించి నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకోడానికి నా పైన చూపిన అప్యాయతకు అందరికి నేను నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను. నేను మీలో ఒకడిని. నిమిత్త మాత్రుడిని అని చెప్పడంలో నేను వెనుకంజవేయడం లేదు. ముఖ్యమంత్రిగారు నన్ను నామినేషన్ వేయమన్నప్పుడు శ్రీపాదరావుకి ఇస్తే అప్పొజిషన్ లీడర్సు అందరికి ఆమోదయోగ్యముగా ఉంటుంది అన్న వాచ ఏదైతే వచ్చిందో అది నాకు కొంత బలము చేకూర్చినట్లు అయింది. అప్పొజిషన్ లీడరుగా ఉన్న ఎన్.టి. రామారావుగారి ఆశీర్వచనం కావాలని నేను, రామచంద్రారెడ్డిగారు వారి దగ్గరకు వెడితే ఎంతో గౌరవప్రదంగా ఆహ్వానించి లోపలికి తీసుకువెళ్లి నన్ను నామినేషన్ చేయమని ప్రతిపాదించారు. సామాన్యంగా అప్పొజిషన్ వారు సపోర్టు చేయుట జరుగుతుంది గాని ప్రతిపాదించడం జరగదేమో అన్న అపోహను తొలగించిన అప్పొజిషన్ లీడర్లు అందరికి, శాసన సభ్యులందరికి నేను నా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను. ఏది ఏమైనా ఎవరైనా ఒకరు సభాపతిగా, మంత్రులుగా ఎం.ఎల్.ఏలుగా ఉన్నవారిలో నుంచి ఎవరో ఒకరు కావలసిందే. నేను ఇంత పెద్దవాడినా నాకు అంత క్యారక్టరు ఉందా అని ఆశ్చర్యపోతూ నా మీద చూపిన ఈ అప్యాయతకు ఆనందబాష్పాలు రాలుస్తున్నాను అని చెప్పితే అతిశయోక్తి కాదని మనవిచేస్తున్నాను. నాకు ఒకటే యాదికి ఉంటుంది ఢిల్లీకి రాజు అయినా తల్లికి కొడుకునే అని. నేను సభాపతి అయినా ఒక సేవకుడనే. ఈ వేళ ఈ స్థానంలో ఉంచవచ్చు. రేపు ఎక్కడో ఉండవచ్చు, దేశాన్ని కాపాడుతాము అని మనం అనుకున్ననాడు, ఈ సాంప్రదాయాలు అన్ని మనకు సౌలభ్యముగా నిర్మాణం చేసుకున్ననాడు, ఈ దేశం బాగుపడుతుందేమో

అనుకునే వారిలో మీ తీరుగానే నేను ఒకడిని అనుకుంటున్నాను. మీరు చూపిన అప్యాయతకు నా కృతజ్ఞతలు అని చెపుతున్నాను. మరి డెమొక్రటిక్ నార్మ్స్ మీద కూడా చెప్పవలసి ఉంది. ఈ సభలో మీరు అంతా చూసే ఉంటారు. ఒక విధంగా పోడియమ్ ముందుకు రావడం, ఆ కాలములోగాని, ఈ కాలములోగాని, ఏ పార్టీగాని మైకులను ఇప్పుడే అనడం లేదు, ఆనాటి నుంచి ఈనాటి వరకు జరుగుతున్నాయి. మీరు ఏకగ్రీవంగా ఎన్నుకున్నందుకు, చాలా సమయం తీసుకుందాము అనుకున్నాను గాని సమయం లేదు, పెద్దలందరికి ప్రత్యేకంగా నన్ను నామినేట్ చేసిన గౌరవనీయ పెద్దలు ముఖ్యమంత్రిగారికి, ప్రత్యేకంగా హైకమాండ్ నుంచి వచ్చిందని, చెప్పిన హైకమాండ్ నేతలకు, ఈ ప్రక్క నుంచి ఎన్.టి. రామారావుగారికి, నాగేశ్వరరావుగారికి, వెంకటేశ్వరరావు గారికి, విద్యాసాగరరావుగారికి, నర్సిరెడ్డిగారికి, అమానుల్లాఖాన్‌గారికి, జగపతిరావుగారికి, జె.కె. రెడ్డిగారికి, ఓమ్‌కార్‌గారికి, అందరికి, మరి ప్రతిపాదించి సంతకం పెట్టినప్పుడు మీరు అప్యాయత చూపించినట్లు కాకుండా నన్ను ఈ సేవకునిగా, సభాపతిని చేసినందుకు నా ప్రత్యేక కృతజ్ఞతలు చెబుతూ నేను ఈ పదవిలో ఉన్నంత కాలములో మీరు ఏ గౌరవం చూపించారో ఆ గౌరవానికి బద్ధుడినయి ఉంటానని మరొకసారి మీ అందరికి మనవి చేస్తున్నాను. సభ ఇంతకు పూర్వం ఏ విధంగా ఉన్నది అని నేను అనకుండా అటువంటి పదజాలముతో కాకుండా ఇంకా ఏ విధమైనటువంటి అభ్యంతరాలు రాకూడదని నేను అందరితో మనవిచేస్తున్నాను. శాసనసభ గౌరవాన్ని అవతల చూస్తున్నారు. మనము ఏమి అనుకుంటున్నాము, అట్టడుగున ఉన్న బలహీనవర్గాలకు ఏమి సేవ చేస్తున్నాము, లేక అసెంబ్లీకి వచ్చి పోడియం దగ్గరో, అక్కడో ఇక్కడో పోట్లాడుతున్నామని, ప్రజలు చాలా మటుకు అనుకుంటున్నారు. గ్రామ పంచాయతీ మీటింగే బాగా జరుగుతోందని అని, ఆ భావనను తొలగించాలని మీ అందరితో మనవి చేస్తూ మీరు చూపిస్తున్న అప్యాయతకు ఎప్పుడూ బద్ధునిగా ఉంటానని, సేవకునిగా ఉంటానని మనవి చేస్తూ మీరు చూపించిన గౌరవానికి మరొకసారి నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుతూ శెలవు తీసుకుంటున్నాను.

# శ్రీ యనమల రామకృష్ణుడు

శ్రీ యనమల రామకృష్ణుడు పదవ శాసనసభ **(1994-1999)** స్పీకరుగా **1995**వ సంవత్సరం జనవరి **12**వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై **1999**వ సంవత్సరం అక్టోబర్ **10**వ తేదీ వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు శ్రీ అప్పారావు, శ్రీమతి సరస్వతి దంపతులకు **1951**వ సంవత్సరము మే **12**వ తేదీ తూర్పు గోదావరి జిల్లా ఎ.వి. నగరం గ్రామంలో జన్మించారు. రాజమండ్రిలోని గవర్నమెంట్ కాలేజీ నుండి పట్టభద్రులైన తరువాత మధ్యప్రదేశ్‌లోని సాగర్ యూనివర్సిటీ నుండి ఎల్.ఎల్.బి. డిగ్రీని పొంది కొంత కాలం న్యాయవాదిగా ప్రాక్టీస్ చేసారు.

శ్రీ రామకృష్ణుడు **1983**వ సంవత్సరములో ఏడవ శాసనసభకు, **1985**వ సంవత్సరంలో ఎనిమిదవ శాసనసభకు, **1989**వ సంవత్సరంలో తొమ్మిదవ శాసనసభకు, **1994**వ సంవత్సరంలో పదవ శాసనసభకు, **1999**వ సంవత్సరంలో పదకొండవ శాసనసభకు, **2004**వ సంవత్సరంలో పన్నెండవ శాసనసభకు వరుసగా తుని నియోజకవర్గం నుంచి ప్రాతినిధ్యం వహిస్తున్నారు.

వీరు **09-1-1983** నుండి **16-08-1984** వరకు తిరిగి **16-09-1984** నుండి **22-11-1984** వరకు శ్రీ ఎన్.టి. రామారావు మంత్రి వర్గంలో పురపాలన, పట్టణాభివృద్ధి సంస్థలు, పట్టణ నీటి సరఫరా, న్యాయస్థానాలు, మురికివాడల నిర్మూలన, శాసనసభ వ్యవహారాలు, గృహనిర్మాణ మంత్రిగా పనిచేశారు. **1983-1984** సంవత్సరములో వీరు సదుపాయాల కమిటీకి అధ్యక్షులుగా ఉన్నారు. **1985**వ సంవత్సరములో శ్రీ ఎన్.టి. రామారావు మంత్రి వర్గంలో **09-03-1985** నుండి **11-07-1987** వరకు సహకార శాఖ మంత్రిగా పనిచేసారు. **1989-1990** మధ్యకాలంలో ప్రభుత్వ సంస్థల కమిటీకి అధ్యక్షులుగా, **1991-1992** మధ్యకాలంలో ప్రభుత్వ లెక్కల కమిటీకి అధ్యక్షులుగా పనిచేసి ప్రభుత్వానికి నిర్మాణాత్మకమైన సిఫారసులతో కూడిన నివేదికలను శాసనసభకు సమర్పించడం జరిగింది.

వీరు స్పీకరుగా ఉన్న సమయంలో దేశం మొత్తం మీద మన రాష్ట్రంలో మొదటి సారిగా నైతిక విలువల కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. అదే విధంగా ఈయన హయాంలోనే శాసనసభ్యులు ప్రతి సంవత్సరం తమ ఆస్తుల వివరాలను స్పీకరుకు అందచేయాలనే నియమాన్ని రూపొందించారు. అలాగే వీరి హయాంలో శాసనసభ కార్యకలాపాలను టీవీలలో ప్రత్యక్ష ప్రసారం చేయడం ప్రారంభమైనది. వీరి హయాంలోనే మొదటి సారిగా అల్ప సంఖ్యాక వర్గముల సంక్షేమ కమిటిని ఏర్పాటు చేశారు.

శాసనసభ కమిటీల పనితీరును మెరుగుపరచడానికి ఆయన విశేషంగా కృషి చేశారు. శాసనసభా కమిటీలు చేసిన సిఫారసులను సాధారణంగా అమలు పరచవలసిందేనని, అయితే కొన్ని సందర్భాలలో ప్రభుత్వం అందుకు భిన్నంగా వ్యవహరించాల్సి వచ్చినప్పుడు అలా ఎందుకు వ్యవహరించవలసి వచ్చిందో శాసనసభకు తెలియజేయవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంటుందని నొక్కి వక్కాణించారు. శాసనసభకు ప్రాతినిధ్యం వహించే శాసనసభ కమిటీల నివేదికలపై తీసుకున్న చర్యల నివేదికను ప్రభుత్వం ఆ కమిటీ నివేదికను పంపిన తరువాత ఆరు నెలలలోగా శాసనసభకు సమర్పించవలసి ఉంటుందని 1998, ఏప్రిల్ 28వ తేదీన ఇచ్చిన రూలింగులో శ్రీ రామకృష్ణుడు స్పష్టం చేశారు.

వీరు స్పీకరుగా అనేక సదస్సులలో పాల్గొన్నారు. అమెరికా, కెనడా, యు.కె., ఫ్రాన్సు, బ్రెజిల్, చైనా, జపాన్, సింగపూర్, మారిషస్, ఇజ్రాయిల్, యునైటెడ్ ఆరబ్ ఎమిరైట్స్ మొదలైన దేశాలలో పర్యటించి ప్రజాస్వామ్య వ్యవస్థల పనితీరును అధ్యయనం చేశారు.

1999వ సంవత్సరములో శాసనసభ్యునిగా ఎన్నికైన తరువాత శ్రీ చంద్రబాబు నాయుడు మంత్రి వర్గంలో 11-10-1999 నుండి 14-05-2004 వరకు ఆర్థిక, ప్రణాళిక, చిన్న మొత్తాల పొదుపు, లాటరీలు మరియు శాసనసభ వ్యవహారాల మంత్రిగా సమర్థవంతంగా పనిచేశారు.

2004 సంవత్సరములో 12వ శాసనసభ సభ్యుడైన శ్రీ రామకృష్ణుడు ప్రభుత్వ లెక్కల కమిటీకి అధ్యక్షునిగా వ్యవహరిస్తున్నారు.

# శ్రీ రామకృష్ణుడు స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

సభానాయకులు, గౌరవ ముఖ్యమంత్రిగారు, వివిధ పార్టీలకు చెందిన ప్రతిపక్ష నాయకులు, మంత్రులు, గౌరవ శాసనసభ్యులు ఈ 10వ శాసనసభకు నన్ను ఏకగ్రీవంగా అధ్యక్షునిగా ఈ గౌరవం కలిగించినందుకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. సభ్యులంతా నా గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలకు వారికి నా అభివందనాలు. ఈ సభను హుందాగా నడపడానికి, గౌరవ ప్రతిష్టలను యినుమడింపజేయడానికి, సత్‌సంప్రదాయాలను నెలకొల్పడానికి నేను శక్తివంచన లేకుండా కృషి సలుపగలనని మనవిచేస్తున్నాను. ఈ సభ నిర్వహణలో మనం అనేక సమస్యలను ఎదుర్కోవలసి వుంటుంది. వాటన్నింటినీ ప్రజా సంక్షేమ దృష్టితో, ప్రజాస్వామ్య పద్ధతిలో మనం పరిష్కరించుకోవాలే తప్ప మైకులు లాక్కోవడం, బల్లలు విరగ్గొట్టడం వంటి చర్యలకు పూనుకోవడం ప్రజాస్వామ్య విరుద్ధం. ఒకరిపై ఒకరు నిందలు వేసుకోవడం, సభకు అంతరాయం కలిగే విధంగా నడచుకోవడం సభకు గౌరవం కాదు. సమస్యకు తన మేధస్సుతో స్పందించాలే తప్ప భుజబలంతో కాదు. శాసనసభలో మనకు గల సమస్యలను దృష్టిలో వుంచుకుని, కాలాన్ని సద్వినియోగపరచుకోవాలి. This House is for the debate on public issues but not for confrontation. ప్రజలు ఎన్నో ఆశలు పెట్టుకుని ప్రజాప్రతినిధులుగా మిమ్ములను యిక్కడకు పంపడం జరుగుతోంది. వారి ఆశలకు, ఆశయాలకు అనుగుణంగా సభా కార్యక్రమాలు నడుపుకోవడం మనందరి బాధ్యత. ఈ సభా కార్యక్రమాలు ప్రజలకు తెలియజేయడంలో పత్రికలు ప్రముఖపాత్ర వహించవలసివుంటుంది. కనుక పత్రికా ప్రతినిధులు అందరూ వారి బాధ్యతను సక్రమంగా నిర్వహిస్తారని ఆశిస్తాను. ఈ సభను గౌరవ ప్రదంగా నడపడానికి మీ అందరి సహకారాన్ని కోరుతున్నాను. ఈ 10వ శాసనసభ పనితీరు యితరులకు మార్గదర్శకంగా వుండేలా సభను నడిపేలా నాకు సహకరిస్తారని ఆశిస్తాను. ఈ 10వ శాసనసభలో చాలామంది కొత్త వాళ్లు రావడమే కాకుండా నాలుగైదు పర్యాయాలు కూడా ఎన్నికైన వారు కూడా రావడం జరిగింది. చాలామంది మేధావులు, పెద్దవారు, బాగా చదువుకున్న వారు, విద్యావేత్తలు, అనుభవం వున్నటువంటి ప్రజానాయకులు ఈ సభలో అడుగుపెట్టడం జరిగింది. ఇంతకుముందు శాసనసభలో

జరిగిన తీరు మనకందరకూ తెలిసిన విషయమే. ఈనాడు ఆంధ్రప్రదేశ్ 10వ శాసనసభ యొక్క పనితీరును ప్రజలు గాని, పత్రికలు గాని, మరి మిగతా రాష్ట్రాలు గాని పరిశీలిస్తున్నాయి. అందుచేత ప్రతి శాసనసభ్యుడికి, అధికార పక్ష సభ్యులకు ప్రభుత్వంలో వున్న ప్రతినిధులకు, అదే విధంగా ప్రతిపక్ష సభ్యులకు, ఈ సందర్భంగా మనవిచేసేది లీడర్ ఆఫ్ ది హౌస్ మాట్లాడుతూ చెప్పినట్లు, మీరందరూ నాకు సహకరించవలసి వుంటుంది. ఈనాడు అందరం చిత్తశుద్ధితో సమాజంలో వుండే అసమానతలు తొలగిపోవడం కోసం, సమాజంలో అట్టడుగువర్గాలకు న్యాయం చేయడం కోసం శాసనసభకు వచ్చిన వాళ్లం. వారి సమస్యల విషయంలో యిక్కడ పార్టీల ప్రమేయం లేకుండా, వ్యక్తులతో ప్రమేయం లేకుండా, మతాలతో ప్రమేయం లేకుండా, కులాలతో ప్రమేయం లేకుండా అందరమూ కలిసి శాసనసభలో సరైన రీతిలో, సక్రమమైన రీతిలో వ్యక్తంచేసి, వాళ్ల యొక్క కష్టనష్టాలు తీర్చడం కోసం నాకు సహకరిస్తారని ఆశిస్తాను. మనము యిక్కడ ఈ 10వ శాసనసభలో ప్రజా సమస్యలపై ఏమి తీర్పు యిస్తామో అని ప్రజానీకం ఎదురుచూస్తూ వుంటారు. ఆ తీర్పును మనం సక్రమమైన పద్ధతిలో యిచ్చినట్లయితే అది అందరికీ క్రెడిట్ ఉంటుంది. అంతే తప్ప మనం ఏదో ఈ సభకు స్వంతపనులకోసం గాని, మరొక విధంగా గాని వచ్చి కాలాన్ని వృధా చేసినట్లయితే అది ప్రజాస్వామ్య వ్యవస్థకే ముప్పు తెచ్చినట్లవుతుంది. అందుచేత నేను పదే పదే ఈ సందర్భంగా మనవిచేసేది అందరూ నాకు అన్ని విధాలా సహకరిస్తారని, డిగ్నిటీని, డెకోరమ్‌ను, డీసెన్సీని, హుందాతనాన్ని కాపాడే విధంగా ప్రతి ఒక్కరూ ప్రవర్తిస్తారని ఆశిస్తున్నాను. అదే విధంగా ప్రతీసారీ రాజీనామా గురించి మాట్లాడారు. ఇది స్పీకర్సు కాన్ఫరెన్సులో అనేక సందర్భాలలో వచ్చిన మాట వాస్తవమే. అయితే What is the essence behind the resignation? ఆ తీర్మానాలలో చెప్పింది. ఏకగ్రీవంగా ఎన్నుకునేటట్లు, అతనికి పోటీ లేకుండా చేసినట్లయితే అనే క్లాజును పెట్టుకోవడం జరిగింది. దీని వెనుక స్పీకరుగా ఎన్నుకోబడిన వ్యక్తి వెంటనే పార్టీకి రాజీనామా చేయాలన్న ఉద్దేశ్యం వెనుక ఉన్న ప్రాధాన్యత నిష్పక్షపాతంగా వ్యవహరించాలన్నది. విద్యాసాగరరావుగారికి గాని, ఎవరికీ గాని సందేహం అక్కరలేదు. రాజీనామా చేసినా, చేయకపోయినా నేను నిష్పక్షపాతంగా ఈ హౌస్‌ను కండక్ట్ చేస్తానని మరొకసారి సభ్యులందరికీ హామీ యిస్తున్నాను. అదే విధంగా ముఖ్యమంత్రిగారు కూడా చెప్పారు ప్రభుత్వపరంగా

ఏ విధమైన ఆటంకాలు లేకుండా, ప్రజాస్వామ్యానికి ప్రత్యేక ప్రాముఖ్యం యివ్వడం జరుగుతుందని. ఏ విధమైన యిబ్బందులు లేకుండా అధికారపక్ష సభ్యులు కోఆపరేట్ చేయడం జరుగుతుందని, ప్రతిపక్ష సభ్యులు, మిగతా సభ్యులు కూడా చెప్పారు. చాలా సంతోషం. మీరిచ్చిన సలహాలకు చాలా కృతజ్ఞుడిని. మిత్రులందరూ చాలా సలహాలను ఇచ్చారు ఈ సలహాలు వారు ఇచ్చినందుకు చాలా కృతజ్ఞతలు. ఈ సలహాలను పరిగణనలోకి తీసుకొని వీలయినంతవరకు ఆచరించడానికి సభ్యులందరూ సహకరించాలి. ఆ విధంగా సహకరించినట్లయితే ఈ సభ అత్యున్నతమయిన సభ కావడమే కాకుండా ఆదర్శవంతమయిన సభ అవుతుంది. మిగిలిన వారు కూడా దీనిని ఒక చక్కని ఉదాహరణగా తీసుకొనే అవకాశం కలిగించాలని మీ అందరినీ కోరుతూ, నన్ను ఏకగ్రీవంగా శాసనసభాపతిగా ఎన్నుకున్నందుకు మరోసారి కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.



శ్రీమతి కె. ప్రతిభా భారతి

11-11-1999 నుండి 30-05-2004

# శ్రీమతి కావలి ప్రతిభా భారతి

శ్రీమతి ప్రతిభా భారతి పదకొండవ శాసనసభ (1999-2003) స్పీకరుగా 1999వ సంవత్సరం నవంబర్ 11వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికై 2004వ సంవత్సరం మే 30 వరకు ఆపదవిని నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ స్పీకర్ పదవికి ఎన్నికైన మొదటి మహిళగా శ్రీమతి ప్రతిభా భారతి చరిత్ర సృష్టించారు.

శ్రీమతి ప్రతిభా భారతి 1956వ సంవత్సరము ఫిబ్రవరి 6వ తేదీన న్యాయమూర్తి డాక్టర్ కొత్తపల్లి పున్నయ్య, శ్రీమతి లీలావతి దంపతులకు శ్రీకాకుళం జిల్లా కావలి గ్రామంలో జన్మించారు. వీరు హైద్రాబాద్‌లోని రాజబహదూర్ వెంకటరామరెడ్డి కళాశాలలో డిగ్రీ పూర్తి చేసి, నాగార్జున విశ్వవిద్యాలయం నుండి ఎమ్.కామ్ పట్టాపొందారు.

శ్రీమతి ప్రతిభా భారతి 1983వ సంవత్సరము ఏడవ శాసనసభకు శ్రీకాకుళం జిల్లా ఎచ్చెర్ల నియోజకవర్గం నుంచి ఎన్నికై 1983 జనవరి నుంచి 1984 ఆగస్టు వరకు ఎన్.టి. రామారావుగారి మంత్రి వర్గంలో సాంఘిక సంక్షేమం, గిరిజన, వెనుకబడిన తరగతులు, వికలాంగుల సంక్షేమం, స్త్రీ శిశు సంక్షేమం, గృహ నిర్మాణ శాఖ సహాయ మంత్రిగా సమర్ధవంతంగా బాధ్యతలను నిర్వహించారు.

1985వ సంవత్సరములో ఎనిమిదవ శాసనసభకు ఎన్నికై 1985 సంవత్సరం మార్చి నుంచి 1989వ సంవత్సరం జూలై వరకు శ్రీ రామారావు మంత్రివర్గంలో సాంఘిక, మహిళా, శిశు సంక్షేమం, సాంస్కృతిక వ్యవహారాలు, పర్యాటక శాఖ మంత్రిగా పనిచేశారు. వీరు 1989వ సంవత్సరము తొమ్మిదవ శాససభకు ఎన్నికై శాసనసభ కమిటీలైన వెనుకబడిన తరగతుల సంక్షేమం, హామీల కమిటీ, అంచనాల కమిటీ, అర్జీల కమిటీలలో పని చేశారు.

వీరు 1994వ సంవత్సరములో పదవ శాసనసభకు ఎన్నికై శ్రీ రామారావు మంత్రివర్గంలో 1994-1995 సంవత్సరముల మధ్య కాలంలో సాంఘిక సంక్షేమ, మహిళా శిశు సంక్షేమ మంత్రిగా పనిచేసారు. వీరు చంద్రబాబు నాయుడుగారి మంత్రి వర్గంలో 01.10.1998 నుండి 11.10.1999 వరకు ఉన్నత విద్యా శాఖ మంత్రిగా పనిచేశారు.

శ్రీమతి ప్రతిభా భారతి 2000 సంవత్సరం సెప్టెంబర్ 13న శాసనసభలో వెనకబడిన ప్రాంతాల అభివృద్ధిపై జరిగిన చర్చ సమయంలో ఉదయం 8.30 నుండి రాత్రి 9.30 గంటల వరకు ఎటువంటి విరామం లేకుండా పదమూడు గంటలపాటు శాసనసభను నిర్వహించారు.

రాజ్యాంగ నియమాలు, చట్ట నిబంధనలు పాటించే విషయములో శ్రీమతి ప్రతిభా భారతి ఖచ్చితంగా వ్యవహరించేవారు. శాసనసభకు ఎన్నికైన సభ్యులు రాజ్యాంగంలోని మూడవ షెడ్యూలులో పొందుపరచిన విధంగానే ప్రమాణం చెయ్యాలని, అలాకాక రాజకీయ పార్టీల నాయకుల పేర్ల మీద గాని, తమకు ప్రీతిపాత్రమైన వారి పేర్ల మీద గాని ప్రమాణం చేయడం చెల్లదని శ్రీమతి ప్రతిభాభారతి 1999 వ సంవత్సరము నవంబరు 12వ తేదీన రూలింగు ఇచ్చారు.

వీరి హయాంలో 2000 సంవత్సరం మే నెల 29, 30, 31 తేదీలలో 63వ అఖిల భారత స్పీకర్ల సదస్సు, అదే సంవత్సరం నవంబరు 14వ తేదీ నుండి 16వ తేదీ వరకు ఎనిమిదవ ఆసియా పసిఫిక్ పార్లమెంటేరియన్ల సదస్సు హైద్రాబాదులో జరిగింది.

కామన్ వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ ఆంధ్రప్రదేశ్ బ్రాంచ్ అధ్యక్షురాలిగా, కామన్‌వెల్త్ వుమెన్ పార్లమెంటేరియన్స్ ఆఫ్ ద సి.పి.ఎ. స్టీరింగ్ కమిటీ అండ్ స్టాండ్ బై మెంబర్‌గా పనిచేశారు. సి.పి.ఎ. ఆంధ్రప్రదేశ్ అధ్యక్షురాలిగా వీరు అనేక సదస్సులలో పాల్గొన్నారు. వీరు అమెరికా, ఇంగ్లండ్, ఈజిప్ట్, ఆస్ట్రేలియా, థాయిలాండ్, న్యూజిలాండ్ మొదలైన దేశాలలో పర్యటించారు.

## శ్రీమతి ప్రతిభా భారతి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

గౌరవనీయులైన సభా నాయకులైన నారా చంద్రబాబునాయుడుగారు, గౌరవనీయ ప్రతిపక్ష నాయకులు డా. వై.ఎస్. రాజశేఖరరెడ్డిగారు, గౌరవనీయులైన శాసనసభ్యులారా.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర 11వ శాసనసభకు సభాపతిగా నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నందుకు, మహిళాభ్యుదయంలో రాష్ట్రాభ్యుదయం సాధించాలనే పవిత్ర భావంతో ఒక మహిళను శాసనసభ స్పీకర్‌గా నియమించి శాసనసభ చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించి, రాష్ట్ర చరిత్రలో గౌరవ ప్రతిష్టలు సంపాదించిన సభా నాయకులు గౌరవ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుగారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు తెలియ జేస్తున్నాను. అదే విధంగా ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన ప్రతిపాదనలను అంగీకరిస్తూ, ఏకగ్రీవ ఎన్నికకు తోడ్పడిన ప్రతిపక్ష నాయకులు, గౌరవనీయ పెద్దలు వై.ఎస్. రాజశేఖరరెడ్డిగారికి నా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. వారితో పాటు ఏకగ్రీవ ఎన్నికకు సహకరించిన బి.జె.పి. నాయకులు, గౌరవనీయులైన ఇంద్రసేనా రెడ్డిగారికి, అదే విధంగా ఎం.ఐ.ఎం. నాయకులు, గౌరవనీయులైన అసదుద్దీన్ ఒవైసీగారికి, గౌరవ శాసన సభ్యులందరికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఎందరో విజ్ఞులు, అనుభవజ్ఞులు వున్న ఈ శాసనసభ ఇంతటి మహోన్నత కర్తవ్య నిర్వహణా బాధ్యతను నాకు అప్పగించడం, నా పట్ల మీకున్న గౌరవాభిమానాలను, నమ్మకాన్ని ప్రస్ఫుటంగా చాటి చెబుతోంది. సభాపతిగా నా విధుల నిర్వహణలో నియమబద్ధంగా, న్యాయ సమ్మతంగా వ్యవహరిస్తానని, తన, పర, భేదాలను విస్మరించి, అధికార ప్రతిపక్ష సభ్యులను సమదృష్టితో పరిగణించి, ప్రజాహితమే ధ్యేయంగా సభా కార్యక్రమాలు సక్రమంగా జరిగేలా మీ అందరి సహాయ సహకారాలతో నిష్పక్షపాతంగా నా బాధ్యతలను నిర్వహిస్తానని నేను మీకు వాగ్దానం చేస్తున్నాను.

సభా నిర్వహణలో మహనీయులుగా కీర్తిగాంచిన శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావుగారు, శ్రీ బి.వి. సుబ్బారెడ్డి గారు, పూర్వ సభాపతులు నెలకొల్పిన సత్సంప్రదాయాల బాటలో పయనిస్తూ, సభ్యుల యొక్క హక్కులను పరిరక్షిస్తూ, సభా మర్యాదలను కాపాడుతూ,

సభా కార్యక్రమాలు హుందాగా, ఆదర్శనీయంగా జరిగేలా నా శాయశక్తులా నేను కృషి చేస్తాను.

సభాపతులకు గురుతుల్యులైన భారత పార్లమెంట్ పితామహులు, బహుజన మన్ననలు పొందిన భారత లోక్‌సభ ప్రప్రథమ సభాపతి శ్రీ జి.వి. మౌలంకర్ పేర్కొన్నట్లుగా పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో సభాపతి స్థానం అత్యంత కీలకమైనదే కాదు, అత్యంత సంక్లిష్టమైనది కూడా, ప్రజాభిమతానికి అనుగుణంగా, ప్రజలకు అవసరమైన శాసనాలను రూపొందించేలా, సభ్యులను కార్యోన్ముఖులనుచేసి, సభకు సమాజానికి  సారధిగా వ్యవహరించవలసిన గురుతర బాధ్యత సభాపతిపై వుంటుంది. ఇంత ముఖ్యమైన విధి నిర్వహణను విజయవంతంగా నిర్వహించడానికి మీ అందరి సహాయ సహకారాలూ ఎంతైనా అవసరం. గత సభాపతి శ్రీ యనమల రామకృష్ణుడు సభా కార్యక్రమాల ప్రత్యక్ష ప్రసారం, నైతిక విలువల కమిటీ ఏర్పాటు, సభ్యులకు మార్గదర్శక సూత్రాలు, ప్రవర్తనా నియమావళి వంటి సంస్కరణలను ప్రవేశపెట్టారు. వారికి నేను అభినందనలు తెలియజేస్తున్నాను. నైతిక విలువల కమిటీ నిర్ణయించిన ధార్మిక సూత్రాలు, నియమాలు, విధులు అందరూ పాటించినప్పుడు శాసనసభా గౌరవం పెంపొందించగలము, ఈ కృషిలో నా వంతు కర్తవ్యాన్ని నేను నిర్వహిస్తానని హామీ ఇస్తున్నాను.

మీ అందరూ కూడా ఈ బాధ్యతలను పాటించి ఆదర్శ శాసనసభ సభ్యులుగా గౌరవ ప్రతిష్టలు సంపాదించగలరని నేను ఆశిస్తున్నాను. ఈ రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రప్రదేశ్‌గా మార్చే గురుతరమైన బాధ్యతను ప్రజలు మనకు సమిష్టిగా అప్పగించారు. జవాబుదారీతనంతో అధికార పక్షం, బాధ్యతాయుత ప్రవర్తనతో ప్రతిపక్షం సంయమనం పాటిస్తూ సభా కార్యక్రమాలు సజావుగా జరగడానికి తోడ్పడినపుడే సంక్షేమ రాజ్యావిష్కరణ సులభ సాధ్యమవుతుంది. ఈ కృషిలో సభాపతిగా నా వంతు కర్తవ్యాన్ని నిర్వహించడానికి గౌరవ సభ్యులందరి మధ్య సమన్వయాన్ని సాధించడానికి త్రికరణ శుద్ధిగా పాటు పడతానని నేను హామీ ఇస్తున్నాను. మీరు కూడా సభా గౌరవాన్ని ఇనుమడింప చేయడానికి సర్వదా కృషి చేస్తారని, శాసన సభ గౌరవ మర్యాదలు కాపాడతారని నేను ఆశిస్తున్నాను.

గౌరవ శాసన సభ్యులందరూ రాజకీయ, రాగద్వేషాలకు అతీతంగా సభ గౌరవ మర్యాదలను పెంపొందించడంలోనూ, సమయ పాలనలోనూ నియమబద్ధ నిర్వహణలోనూ సంపూర్ణ సహాయ సహకారాలు అందిస్తూ నాకు చేదోడు వాదోడుగా నిలుస్తారని నేను మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నాను. భారత సభాపతులలో వాచస్పతిగా వాసికెక్కిన శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ ఈ విధంగా అన్నారు.

"I will not let down the House, not the prestige of the House or that of any Member. I will stand by all the privileges that are legitimately given to the Members. I will try to maintain the dignity of the House and I hope and trust that I will be able to do so with your co-operations."

Thank you very much.

***Jai Hind.***



**శ్రీ కె.ఆర్. సురేశ్ రెడ్డి**

01-06-2004 నుండి

# శ్రీ కేతిరెడ్డి సురేశ్ రెడ్డి

శ్రీ సురేశ్ రెడ్డి పన్నెండవ శాసనసభ స్పీకరుగా 2004వ సంవత్సరం జూన్ 1వ తేదీన ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

శ్రీ సురేశ్ రెడ్డి శ్రీ కె.ఆర్. గోవిందరెడ్డి, శ్రీమతి విమలాదేవి దంపతులకు 1959వ సంవత్సరము మే 25వ తేదీన నిజామాబాదు జిల్లా కమ్మరపల్లిలో జన్మించారు. వీరు నిజాం కళాశాలలో డిగ్రీ పూర్తి చేశారు.

వీరు 1989వ సంవత్సరంలో తొమ్మిదవ శాసనసభకు, 1994వ సంవత్సరంలో పదవ శాసనసభకు, 1999వ సంవత్సరంలో పదకొండవ శాసన సభకు, 2004వ సంవత్సరంలో పన్నెండవ శాసనసభకు నిజమాబాద్ జిల్లా, బాల్కొండ నియోజవర్గం నుండి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. వీరు 1990-1991 మరియు 1991-1992 సంవత్సరాలలో లైబ్రరీ కమిటీ అధ్యక్షునిగా, 1998-1999 సంవత్సరాల మధ్యకాలంలో ప్రభుత్వ లెక్కల కమిటీ అధ్యక్షునిగా సమర్థవంతంగా పనిచేసారు.

వీరు ప్రస్తుతం కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ ఆంధ్రప్రదేశ్ శాఖకు అధ్యక్షునిగా వ్యవహరిస్తున్నారు. వీరు కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోషియేషన్ ఇండియా రీజియన్ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యునిగా, అఖిల భారత స్పీకర్ల స్టాండింగ్ కమిటీ సభ్యునిగా, కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ ఇండియా రీజినల్ రిప్రజెంటేటివ్‌గా ఉన్నారు.

వీరి హయాంలో 2004వ సంవత్సరం జూలై 14వ తేదీన భారత రాష్ట్రపతి డాక్టర్ ఎ.పి.జె. అబ్దుల్ కలాం శాసనసభను ఉద్దేశించి ప్రసంగించారు. 2004వ సంవత్సరం నవంబరు 18వ తేదీ నుండి 20వ తేది వరకు మొట్ట మొదటి భారత - ఆసియా రీజినల్ కామన్‌వెల్త్ పార్లమెంటరీ అసోసియేషన్ సదస్సు హైద్రాబాదులో జరిగింది.

వీరు వన్యప్రాణులు, పర్యావరణ పరిరక్షణ కమిటీని శాసన సభలో మొదటి సారిగా ఏర్పాటు చేసారు.

వీరు 2004వ సంవత్సరము సెప్టెంబరులో కెనడాలో జరిగిన 50వ కామన్‌వెల్త్ పార్లమెంటరీ సదస్సులోను, 2005వ సంవత్సరము సెప్టెంబరులో నాడి, ఫిజి ఐలాండ్స్‌లో జరిగిన 51వ కామన్‌వెల్త్ పార్లమెంటరీ సదస్సులోను పాల్గొన్నారు. వీరు అమెరికా బ్రిటన్, న్యూజిలాండ్, సింగపూర్, కెనడా దేశాలలో పర్యటించారు.

శ్రీ సురేశ్ రెడ్డి తనదైన శైలిలో సభా వ్యవహారాలను నడుపుతూ సభా గౌరవాన్ని యినుమడింప చేస్తూ భావితరాలకు ఆదర్శ ప్రాయులవుతున్నారు. సమయపాలన ఖచ్చితంగా పాటించాలని శ్రీ సురేష్ రెడ్డి భావిస్తారు. సభా కార్యక్రమ పట్టికలో ఉన్న అంశాలకి సభ్యులు సాధారణంగా పరిమితం కావాలని, ఆరోపణలు ప్రత్యారోపణల వల్ల అమూల్యమైన సభాసమయం వృధా అవుతుంది కనుక అత్యంత ప్రాముఖ్యత గల ప్రజా విషయాలను చర్చించే అవకాశం లేకుండా పోతుందని శాసనసభ సమావేశాలలో అత్యధిక ప్రజా సమస్యలు చర్చకు వచ్చినట్లయితే ప్రజలకు వుపయుక్తంగా వుంటుందని అందువలన ఆంధ్రప్రదేశ్ శాసనసభ కార్యక్రమ నియమావళిలో అయా అంశాలకు కేటాయించిన సమయ పరిమితికి సభ్యులందరూ కట్టుబడి ఉండాలని శ్రీ సురేష్ రెడ్డి 2005, మార్చి 14వ తేదీన తమ రూలింగులో స్పష్టం చేశారు.

సామాన్య ప్రజలతో మమేకం అవుతూ వారిచ్చిన వినతులను స్వీకరించి, ఆయా సమస్యల పరిష్కారానికి అవిరళ కృషి చేస్తున్నారు.

## శ్రీ కె.ఆర్. సురేశ్ రెడ్డి స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

Respected Chief Minister and Leader of the House Dr. Y.S. Rajasekhara Reddy garu, distinguished Opposition Leader Sri Nara Chandrababu Naidu garu, Leader of TRS Dr. G. Vijayarama Rao garu, Leader of CPM Sri Nomula Narasimhaiah garu, Leader of CPI Sri Venkata Reddy garu, Leader of MIM Sri Akbaruddin Owaisi garu, BJP Leader Sri G. Kishan Reddy garu, CPI ML Member Sri Gummadi Narasaiah garu, BSP Leader Sri L. Raja Rao garu, SP Member Smt. D. K. Aruna garu, Janata Member Sri K. Ramulu garu and Hon'ble Members, let me first place on record my deep sense of gratitude to all of you for electing me unanimously to the highest office of the Speaker. I am very much grateful to each and every Member of this August House for entrusting me the honour of responsibility of Speaker-ship with great trust and tremendous confidence on me. I am really overwhelmed with joy for the love and affection bestowed upon me by every section of the House. I swear to keep up the trust and confidence shown on me by the entire House both by word and the spirit. I strongly feel that electing a Member as Speaker is the highest honour that a House can confer on any Member. I am delighted to have been selected for this honour by all of you unitedly. Till a few minutes back, I belonged to a particular political pary. But now I belong to the entire House.

Irrespective of political affiliations each and every Member of the House is very dear and near to me. Rules and conventions will be followed judiciously in a non-partisan manner. Manners of decorum and decency shall be our priority. I will endeavour to render justice to all the Members with equal treatment and balance on merits.

Prior to me this House was presided over by men of wisdom, character and dynamism like Sri Ayyadevara Kaleshwara Rao garu and Sri B.V. Subba Reddy garu and so on. I will uphold all the healthy democratic traditions and the conventions established by my predecessors for which I need your fullest co-operation and good-will at every moment for successful conduct of the business in an orderly disciplined manner.

We all must remember that we have been elected to this Augsut House at a crucial moment in the history of our State. Thousands of small and marginal farmers and millions of common-men are looking at us with tears in their eyes and lot of hopes in their hearts. We all must keep in our mind that it is our fundamental responsibility to strive to wipe out those tears by all possible means. Whatever be the political affiliations and ideological commitments, we all must strive together to echo their problems with meaningful dialogue followed by reasonable soulutions. Otherwise, history will never forgive us whether we are in Opposition or in Treasury Benches we should stand united for any genuine public cause and reflect the aspirations of common people in a decent and desired manner.

I expect that this House will witness some historical and eventful discussions as we are having a large number of well experienced members and verteran legislators with us. Fortunately our present Leader of the House Dr. Y.S. Rajasekhara Reddy garu was the Leader of Opposition in the previous House. He can understand better the demands of Opposition and the pulse of the public and anyone-else can respond with right perspective. Similarly, the present Opposition Leader Sri N. Chandrababu Naidu garu was having the longest serving record as Chief Minsiter. He knows his limitations of the Government and the Treasury Benches. I hope this combination will serve the State beter and enhance the decorum of the House, a meaningful discussion and purposeful debate. The present composition of the House is also evenly balanced with more than half of the

legislators being experienced and 138 members new to the legislative Body. The blood of old and new will definitely make the proceedings of the House most pleasant and lively.

We must not debate just for the cause of debate. It must be fruitful for the public cause. I am confident that every Member of the House will make the fullest efforts to enrich prestige of the House by debating and discussing public issues in an orderly manner like the true disciplined solidiers of democracy. I promise that as stated by Ananthasayanam Ayyangar, one of the greatest figures of the Lok Sabha, I will not let down the prestige of this House or that of any Member. I will stand by all the privileges that are legitmately due to the Members. I will try to maintain the decorum of the House and I hope that I will be able to do so with your co-operation. But to err is human if I commit any mistake in conducting the House, I kindly request you to take it in a broader way and bring it to my notice so that I could correct myself. I never agitate to approach the seniors for conducting House with decency and decorum and to enhance the prestige of the House. I am really fortunate to have the senior-most Members like Sri P. Shambasiva Raju garu, Sri Gade Venkata Reddy garu and Sri Ch. Rajeshwara Rao garu. The men of enviable knowledge of Parliamentary Procedures and Practices and uprightness are available to me for guidance and consultation.

During the course of felicitation, the Hon'ble Chief Minister observed that I am a very young Speaker. I can only say that I may look young, but I am not really young as I am in mid-forties. Probably it is my mother who gave birth to such a wonderful child. Regarding the Umpire, he has also mentioned that I am very good Umpire. I assure the House that definitely there would not be any need for the third Umpire. The Hosue will definitely run in the way it should run. The Opposition Leader Sri Nara Chandrababu Naidu garu మాట్లాడుతూ మీరు మావైపు కూడా చూడాలని

అన్నారు. Definitely. I will look towards you. My profile when I look towards the left will be better. Sri Vijayarama Rao garu మాట్లాడుతూ వెనుక బెంచీలలో కూర్చున్నటువంటి సభ్యులకు, కొత్తగా వచ్చినటువంటి సభ్యులకు అవకాశం కల్పించాలని కోరారు.

Back Benches Definitely they will get opporutnity as and when need comes. శ్రీ నోముల నర్సింహయ్యగారు మాట్లాడుతూ కొత్త ప్రోవిజన్స్ అవసరాన్ని గురించిన విషయం చెప్పారు. అలాగే చాలా మంది పెద్దలు మాట్లాడుతూ చాలా సలహాలు ఇచ్చారు. రాబోయే రోజులలో వారందరి సహకారంతో, Let us incorporate what is needed to make this legislature more effective to meet the needs of the people. చాలా మంది క్రొత్త సభ్యులు వచ్చారు. అటెండెన్స్ ఎక్కువగా వుండాలి. I would like to see more walk-ins than more walk-outs. I expect good attendance also from all the Members and finally I trust and hope that all the Hon'ble Members will extend their fullest co-operation in true spirit of democracy for effective functioning of the House.

I once again express my sincere thanks for all the Hon'ble Members of this August House for electing as Speaker unanimously.

Thank you all.



శ్రీ కల్లూరి సుబ్బారావు

27-04-1955 నుండి 15-04-1957

# శ్రీ కల్లూరు సుబ్బారావు

శ్రీ కల్లూరు సుబ్బారావు శాసనసభ (1955-1962) డెప్యూటీ స్పీకర్‌గా 1955, ఏప్రిల్ 27న ఏకగ్రీవంగా ఎన్నికై 1957 ఏప్రిల్ 15 వరకు ఆ పదవిని నిర్వహించారు.

రాయలసీమ కురు వృద్ధుడిగా పేరు గాంచిన పద్మశ్రీ శ్రీ కల్లూరి సుబ్బారావు 1897వ సంవత్సరము అనంతపురం జిల్లా హిందూపూర్ సమీపంలోని కల్లూరు గ్రామంలో జన్మించారు.

శ్రీ సుబ్బారావు తెలుగు భాషలో విద్వాన్ పట్టా పొంది కొంతకాలం ఉపాధ్యాయునిగా పనిచేశారు. చిన్నతనం నుండే విశిష్ఠమైన దేశభక్తి భావాలు కల్గిన వ్యక్తి సుబ్బారావు గారు. 1918వ సంవత్సరములో గాంధీగారి ప్రసంగాలతో ప్రభావితులై ఖద్దరు వస్త్రాలను మాత్రమే ధరిస్తూ ఇంటింటా గాంధీజీ సందేశాన్ని ప్రచారం చేసారు. శ్రీమతి అనిబెసెంట్ ప్రారంభించిన హోమ్ రూల్ ఉద్యమంలో వీరు పాల్గొన్నారు. 1921వ సంవత్సరములో గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు వీరిని హిందూపూర్‌లో అరెస్టు చేసి 10-12-1921 నుండి 09-12-1922 వరకు తిరుచినాపల్లి, కడలూరు జైళ్ళలో ఉంచారు. ఉప్పు సత్యాగహంలో పాల్గొన్నందుకు వీరు 13-10-1930 నుండి బళ్ళారి, తిరుచినాపల్లి జైళ్ళలో ఒక సంవత్సరం పాటు జైలు శిక్షను అనుభవించారు. 1932వ సంవత్సరములో శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు 11-01-1932 నుండి ఒక సంవత్సరం పాటు బళ్లారి, కొయంబత్తూరు జైళ్ళలో కఠిన కారాగార శిక్షను అనుభవించారు. 1940-1941 సంవత్సరములో గాంధీజీ ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని మరొకసారి జైలుశిక్షను అనుభవించారు. 1942 నుండి 1944 వరకు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని వెల్లూరు, నాగపూరు, అమరావతి జెళ్ళలో శిక్షను అనుభవించి తన సుదీర్ఘమైన జైలు జీవితాన్ని జ్ఞానసమపార్జనకు ఉపయోగించుకొని 'ప్రిజన్ గ్రాడ్యుయేట్' అని పేరు గాంచారు.

వీరు 1937 సంవత్సరములో మద్రాసు శాసనసభ సభ్యుడిగా ఉన్నారు. 1937వ సంవత్సరము నవంబరు 16న రాయలసీమ ప్రయోజనాల పరిరక్షణ కోసం జరిగిన శ్రీబాగ్ ఒప్పందంపై సంతకం చేసిన వారిలో శ్రీ కల్లూరు సుబ్బారావు ఒకరు. వీరు 1946వ సంవత్సరంలో మద్రాసు శాసనసభ నుండి రాజ్యాంగ పరిషత్ సభ్యునిగా ఎన్నికైనారు.

శ్రీ కల్లూరు సుబ్బారావు 1955వ సంవత్సరములో ఆంధ్ర రాష్ట్ర శాసనసభకు అనంతపురం జిల్లా హిందుపూర్ నియోజకవర్గం నుండి శాసనసభ్యుడిగా ఎన్నికైనారు.

శ్రీ సుబ్బారావు మంచి వక్త. ఆయన శాసనసభలో, ప్రజావేదికలపై చేసే ప్రసంగాలు విజ్ఞానదాయకంగాను, గంభీరంగాను, సందేశాత్మకంగాను ఉండేవి. శ్రీ సుబ్బారావు లేపాక్షి శిల్ప కళావైభవాన్ని వెలుగులోనికి తెచ్చేందుకు విశేషమైన కృషి చేశారు. వీరి కృషి వల్లనే నేడు లేపాక్షి శిల్ప సంపద సజీవంగా అలరారుతున్నది. 1967వ సంవత్సరములో వీరికి కేంద్ర ప్రభుత్వం పద్మశ్రీ బిరుదును ఇచ్చి సత్కరించినది.

సుమారు అర్ధశతాబ్దం పాటు రాజకీయ, సామాజిక, సాహితీ, కళారంగాలలో సేవలను అందించిన శ్రీ కల్లూరు సుబ్బారావు 1973, డిసెంబరు 20న మరణించారు.

## శ్రీ కల్లూరు సుబ్బారావు డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం.

అధ్యక్ష, నాయకులారా, శాసనసభ్యులారా, మీరందరు ఏకగ్రీవంగా ఉపాధ్యక్ష పదవి నాకు ఇచ్చి కొన్ని ప్రశంసా వాక్యాలు చెప్పినందుకు కృతజ్ఞతాపూర్వక వందనములు అర్పిస్తున్నాను. ఈ బాధ్యత నాకు బరువే అయినా, మీ మంచి చెడ్డలమీద ఆధారపడి వుంటుంది నేను నిర్వర్తించే వ్యవహారం. సభ్యులు గౌరవప్రదంగా ఈ సభను నడిపించెదరని అనుకుంటాను. మీ ఆదరాభిమానాలతో అధ్యక్షులు, ఉపాధ్యక్షులు సభను జయప్రదంగా నడపవచ్చును. ఒకటి రెండు వాక్యాలు మాత్రం విన్నవించుకుంటాను. ఆంధ్ర శాసనసభకు ప్రథమంగా ఎన్నికైన మీరందరూ ముందు రాబోయే యుగం వారికి శాసనసభా నడవడి విషయమై ఆదర్శప్రాయంగా వుండవలసిన ఆవశ్యకత, బాధ్యత ఎంతైనా వున్నది. మన మందరం ప్రజల బాగోగులను గమనించడం మాత్రమే కాకుండా, శాసనసభ్యులు మాట్లాడే భాషనుగురించి ముందు యుగముల వారికి మార్గదర్శకంగా వుండవలసిన బాధ్యతవున్నది. దాన్ని గమనించి అవసరమైన పదజాలాన్ని ప్రతి సభ్యుడు ప్రతిదినం 10 నిమిషాలు ఆలోచించి భాషను సంకరం చేయకుండా, చూస్తారని ఆశించుచున్నాను. నేను చేతనైనంతవరకు అధ్యక్షులవారికి చేదోడు వాదోడుగా వుండి నా నిష్పాక్షిక ధర్మాన్ని నిర్వర్తిస్తానని విజ్ఞప్తి చేయుచున్నాను.



శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ

16-04-1957 నుండి 11-01-1960

# శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ రెండవ శాసనసభ (1955–1962) డెప్యూటీ స్పీకర్‌గా 1957, ఏప్రిల్ 16న ఏకగ్రీవంగా ఎన్నికై 1960, జనవరి 11వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1915, సెప్టెంబరు 27న ఆదిలాబాద్ జిల్లా వాంకిడి గ్రామంలో జన్మించారు. హైదరాబాదులో మెట్రిక్యులేషన్ పూర్తి అయిన తరువాత ఆర్థిక ఇబ్బందుల కారణంగా వీరు చదువును కొనసాగించలేకపోయారు. అయితే రాత్రి కళాశాలలో చేరి లా కోర్సు పూర్తి చేసి ప్రముఖ న్యాయవాదిగా పేరు పొందారు.

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ 1938 లో జరిగిన పౌరహక్కుల ఉద్యమం మొదటి బృందం సత్యాగ్రహంలో పాల్గొని పుత్లీబౌలి వద్ద అరెస్టయ్యారు. వందేమాతరం ఉద్యమంలోను చురుకైన పాత్ర పోషించారు.

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ న్యాయవాదిగా వృత్తిని ప్రారంభించి, రాజకీయ ఖైదీలు, విప్లవకారుల తరపున కేసులు చేపట్టి ఎందరికో స్వేచ్ఛను ప్రసాదించి ప్రజాదరణ పొందారు. 1942వ సంవత్సరములో క్విట్ ఇండియా ఉద్యమాన్ని హైదరాబాద్‌లో నడిపారు. రజాకార్ల రక్కసి మూకల నుంచి జాతీయ వాదులకు రక్షణ కల్పించడానికి, పాలకులకు వ్యతిరేకంగా పోరాడటానికి జంటనగరాలలోని వివిధ వాడలలో పౌర రక్షణ సంఘాలను స్థాపించి అధ్యక్షుని హోదాలో వాటిని సమన్వయపరిచారు.

వీరు మొదటిసారిగా 1952వ సంవత్సరంలో ఆదిలాబాద్ జిల్లాలోని ఆసిఫాబాద్ నియోజకవర్గం నుండి శాసనసభ్యుడిగా ఎన్నికైనారు. 1957 వ సంవత్సరంలో చినకొండూర్ నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. వీరు శ్రీ దామోదరం సంజీవయ్య మంత్రి వర్గంలో 1960, జనవరి 11 నుండి 1962, మార్చి 11 వరకు చిన్న తరహా, కుటీర పరిశ్రమలు, అబ్కారీ శాఖ మంత్రిగా పనిచేశారు.

వీరు 1967, 1972 సంవత్సరాలలో నల్గొండ జిల్లా భువనగిరి నియోజకవర్గం నుండి శాసనసభకు ఎన్నికైనారు. వీరు డెప్యూటీ స్పీకర్ హోదాలో 1957–1958, 1959–1960 సంవత్సరములలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా ఉన్నారు.

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో 1967, మార్చి 6 నుండి 1969, జూలై 18 వరకు కార్మిక, సమాచార, ప్రజాసంబంధాలు, పర్యాటక శాఖ మంత్రిగా వీరు పని చేశారు.

రాజకీయాలతో పాటే సాంఘిక ఉద్యమాలను ఏక కాలంలో నడిపిన సవ్యసాచి, అలుపెరుగని యోధుడు కొండా లక్ష్మణ్ బాపూజీ గారు.

# శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ డెప్యూటీ స్పీకర్‌గా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, ఈ సభకు నన్ను డెప్యూటీ స్పీకరుగా ఏకగ్రీవముగా సభ్యులందరు ఎన్నుకున్నందుకు, వారందరికి నేను హృదయపూర్వకమైన ధన్యవాదములు తెలియజేస్తున్నాను. ఈ సందర్భములో కొందరు మిత్రులు, పెద్దలు నా యొక్క మంచి గుణములు, యోగ్యతలను గురించి చెప్పారు కాని యీ సమయము చెడులను చూపించేది కాదు. ఎప్పుడైతే నేను అధ్యక్ష స్థానములో కూర్చుని సభా కార్యక్రమములను నిర్వహించే అవకాశము నాకు కలుగుతుందో, అట్టి సమయములో నేను చేసే కార్య నిర్వాహణ ఏ మెంబరుకైనా సమాధానముగా వుండేట్లు సాగించలేకపోతే అప్పుడు నాలో వున్న లోపాలు కనిపిస్తాయని నేను అనుకుంటున్నాను. అయితే యీ సమయములో మాత్రము ఎక్కువ లోపాలు నాలో కనబడకుండా నడచుకొనటానికి ప్రయత్నము చేయగలనని నేను సభ్యులందరికీ హామీ ఇస్తున్నాను.

ఇక పోతే, పార్లమెంటరీ వ్యవహారములలో నాకు చాలా అనుభవము ఉన్నదనే విషయము కాదు. కాని అధ్యక్షులవారి అభిప్రాయమును గమనించుకొని నేను తప్పకుండ నా అనుభవమును ఉపయోగించుకునే ప్రయత్నము చేయగలను. నాకు వున్న కొద్ది అవకాశములోనే నేను ఈ కార్యభారమును సభ్యులనుంచి ఏ విధమైన అపోహలు రాకుండా నిర్వహించే అవకాశము కలుగుతుందో లేదో గాని, నేను మాత్రము నా విధులను పక్షపాతము లేకుండ నిర్వహించగలనని నేను మరొకసారి సభ్యులందరికి హామీ యిస్తున్నాను. అయితే ప్రతిపక్ష సభ్యులు వారి యొక్క హక్కులు ఎక్కువగా కాపాడాలని కోరుతున్నారు. వారి హక్కులను కాపాడే ప్రయత్నము నేను చేస్తాను కాని దానితో పాటు Treasury benches లో ఉన్న వారికి నేను కేవలము పక్షపాతముతో Opposition side వారికే ఎక్కువగా సహాయపడుతూ వ్యవహరిస్తున్నానన్న భావము వారిలో కలగనివ్వకూడదని నా అభిప్రాయము. నేను మాత్రము సభ్యులను ఏ పక్షమువారైనను, అందరిని సమాన దృష్టితో న్యాయము కలిగేటట్లు అన్ని విధముల ప్రయత్నము చేస్తాను. ఈ రోజు నన్ను మీరందరు ఏకగ్రీవముగా యీ సభకు డెప్యూటీ స్పీకరు పదవికి ఎన్నుకున్నను, ఈ ఎన్నికలతో సరిపోదు. మీ అందరికి నచ్చేటట్లుగా ఋజువుచేసే ప్రయత్నము నా చర్యలవల్ల చేస్తానని మరొకసారి మీకు తెలియజేస్తూ నన్ను ఏకగ్రీవముగా ఎన్నుకున్నందులకు మీకందరికి నా ధన్యవాదములను తెలియ జేస్తున్నాను.



## శ్రీమతి టి.యన్. సదాలక్ష్మి

15-03-1960 నుండి 01-03-1962

# శ్రీమతి తక్కెళ్ల సదాలక్ష్మి

శ్రీమతి తక్కెళ్ల సదాలక్ష్మి రెండవ శాసనసభ (1955-1962) డెప్యూటీ స్పీకర్‌గా 1960, మార్చి 15న ఏకగ్రీవంగా ఎన్నికై 1962, మార్చి 1 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు సికింద్రాబాదులోని బొల్లారంలో శ్రీ కొండయ్య, శ్రీమతి గోపమ్మ దంపతులకు జన్మించారు. సికింద్రాబాదు కీస్ ఉన్నత పాఠశాలలో చదివిన అనంతరము మద్రాసు క్వీన్ మేరీస్ ఉమెన్స్ కళాశాలలో చదివినారు. డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ గారి ఉపన్యాసం విని రాజకీయ రంగంలో ప్రవేశించారు.

శ్రీమతి సదాలక్ష్మి 1957వ సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో రాష్ట్ర శాసన సభకు నిజామాబాద్ జిల్లా, కామారెడ్డి రిజర్వుడు నియోజకవర్గం నుండి శాసన సభ్యురాలుగా ఎన్నికైనారు. వీరు శాసనసభ డెప్యూటీ స్పీకర్‌గా తన వాక్‌చాతుర్యంతో, ప్రతిభతో ఆ పదవిని సమర్థవంతంగా నిర్వహించారు. మరియు డెప్యూటి స్పీకర్ హోదాలో 1959-1960, 1960-61 సంవత్సరములలో అర్జీల కమిటీ అధ్యక్షులుగా ఉన్నారు.

వీరు 1962వ సంవత్సరములో నిజామాబాద్ జిల్లా ఎల్లారెడ్డి రిజర్వుడు నియోజకవర్గం నుండి రెండవసారి శాసనసభకు ఎన్నికై డాక్టర్ నీలం సంజీవరెడ్డి మంత్రి వర్గంలో దేవాదాయ, చిన్న మొత్తాల పొదుపు శాఖ సహాయ మంత్రిగా 1962, మార్చి 19 నుండి 1964, ఫిబ్రవరి 28 వరకు పనిచేశారు. 1964, ఫిబ్రవరి 29 నుండి 1967, మార్చి 6 వరకు శ్రీ బ్రహ్మానంద రెడ్డి మంత్రి వర్గంలో సాంఘిక సంక్షేమ శాఖ సహాయ మంత్రిగా పనిచేసారు.

శ్రీమతి సదాలక్ష్మి 1974-1980 సంవత్సరములలో ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్ సభ్యురాలిగా ఉన్నారు.

వీరు 2004, జులై 24న మరణించారు.

## శ్రీమతి తక్కెళ్ల సదాలక్ష్మి డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, ఈ శాసనసభకు నన్ను ఉపాధ్యక్షురాలుగా గౌరవ సభ్యులందరు, ఏకగ్రీవముగ ఎన్నుకున్నందుకు, అభినందిస్తున్నందుకు, మీరు ఆ విషయము గురించి announce చేసి ఆశీర్వదించినందుకు మీకు అందరికి నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. ఇది నాకు ఎంతో ఉత్సాహకరముగనున్నది. మీలో చాలామంది కంటే నేను చాలా చిన్న వయస్సు గల దానను, మీ అధ్వర్యము క్రింద నేను ఈ ఉపాధ్యక్ష పదవికి సంబంధించి, నా విధులను నేను సక్రమంగా నడిపించగలుగుతానని నా ఆశాభావం. మీ ఆశీర్వాదములన్నీ నాకు ఎంతో బలము, ఉత్సాహము చేకూర్చుతున్నవి. ఇంతవరకు గౌరవ సభ్యులు, మంత్రులతో సహా చాలా మంది నన్ను గురించి మాట్లాడారు. వారు నా ఎన్నికను గురించి హర్షిస్తూ, అభినందించారు. వారి అభినందనలు, మీ ఆశీర్వాదములు నాకు ఉత్సాహము, బలమునిచ్చి ఉపాధ్యక్ష పదవికి ఉంటున్న గురుతర బాధ్యతలను నేను శక్తివంతముగ నెరవేర్చగలనని విశ్వసిస్తున్నాను. నేను బాధ్యతతో నెరవేర్చవలసిన విధులను క్రమబద్ధముగ నెరవేర్చుటకు మీరు అందుకు నాకు చేయూతనిచ్చి, నాకు తోడుగా సహాయపడుతారని ఆశిస్తున్నాను. మొట్టమొదట కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ మీటింగులోనే నా పేరు ఉపాధ్యక్ష పదవికి ప్రతిపాదించారు. సభ్యులందరూ ఆమోదించి బలపరచారు. అక్కడ పోటీలేకుండా ఎన్నిక అయ్యాను. తిరిగి ఇక్కడ సభలో అన్ని పార్టీలవారు కూడ ఆమోదించి ఎన్నుకున్నారు. అందుకు నాకు చాలా సంతోషముగ నున్నది. నేను చిన్న వయస్సు గల స్త్రీని, ఐనప్పటికినీ మీ అభినందనలన్నీ నేను నాకు ఆశీర్వాదములుగ స్వీకరించుచున్నాను. మీ అందరి సహాయముతో నేను నా బాధ్యతలను సక్రమముగా నెరవేర్చగలనని మీకందరికీ అభయమిస్తూ నేను  ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

# శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్

శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ డెప్యూటీ స్పీకర్‌గా మూడవ శాసనసభ (1962-1967) 1962, జూలై 7న ఏకగ్రీవంగా ఎన్నికై 1967, ఫిబ్రవరి 28వరకు మరియు నాల్గవ శాసనసభ (1967-1972) 1967, మార్చి 29న ఎన్నికై 1972, మార్చి 1 వరకు ఆ పదవిని నిర్వహించారు.

శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ మాతృ భాష మరాఠీ అయినప్పటికి, వీరి పూర్వీకులు కర్నూలు జిల్లా, ద్రోణాచలం సమీప గ్రామమునకు చెందినవారు. వీరు తెలుగుభాషను చక్కగా మాట్లాడేవారు.

వీరు 1957వ సంవత్సరము తెలంగాణా ప్రాంతము నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభకు జరిగిన ఎన్నికలలో నగరంలోని సుల్తాన్ బజార్ నియోజకవర్గం నుండి ఎన్నికయినారు. వీరు శాసనసభలో వివిధ కమిటీలలో సభ్యునిగా ఉన్నారు. వీరు 1958-1959 సంవత్సరములో అంచనాల కమిటీ అధ్యక్షునిగా ఉన్నారు.

వీరు1962వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో సుల్తాన్ బజార్ నియోజకవర్గం నుండి రెండవసారి శాసనసభ్యునిగా ఎన్నికైనారు. వీరు డెప్యూటి స్పీకర్ హోదాలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా ఉన్నారు.

శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ 1967 వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో నగరంలోని గగన్ మహల్ నియోజకవర్గం నుండి రాష్ట్రశాసనసభకు మూడవసారి ఎన్నికైనారు. వీరు 29-03-1967 న ఉపాధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలో శ్రీమతి జె. ఈశ్వరీ బాయిని ఓడించి ఆ పదవిలో 01-03-1972 వరకు కొనసాగారు. వీరు శాసనసభ సమావేశాలను సమర్థవంతంగా నిర్వహించారు.

## శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, స్వపక్ష సభ్యులు, ప్రతిపక్ష సభ్యులు ఏకగ్రీవంగా నన్ను ఎన్నుకొన్నందుకు నేను నా కృతజ్ఞత వెలిబుచ్చుతున్నాను. నేను ఆంధ్రకు చెందినానా, తెలంగాణాకు చెందినానా, మహారాష్ట్రకు చెందినానా అని ఒక్క నిమిషం కూడ అనుకోకుండా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఒక వ్యక్తిగా, యీ లెజిస్లేచర్‌లోగాని, బయటగాని ఎక్కడ వున్నా, ఆంధ్రుడుగనే భావించుకొంటాను. ఆ అభిమానం నాకు ఉన్నది. నేను యీ పదవిని స్వీకరించేటప్పుడు నాకు కొంత సందేహం కలిగింది. ఇప్పుడు ప్రతి పక్ష నాయకులు తెలుగులో జరిపించాలని చెప్పారు. నేను తెలుగు భాషలో అధికార వాణితో, సామరస్యంగా చెప్పడంలో కొంచెం లోపం వుంటుంది. నాలో యీ విషయంలో ఎంత లోపంవున్నా సభ్యులు నా లోపాలను చూడకుండా నా భావాలనే గ్రహించుతారనే ఉద్దేశంతో నేను యీ సాహసం చేస్తున్నాను, ఇంతేగాదు, తమ విజ్ఞానం, experience అన్నీ కూడ నాకు కలుగుతాయి, కనుక నేను ఆ ఆశతో అంగీకరించాను. తమ guidance తీసుకొంటాను, నేను యీ August Body యొక్క dignity ని మీ అందరి సహకారంతో కాపాడగలనని ఆశిస్తున్నాను. సభ్యుల అందరి legitimate rights కాపాడడానికి మీరు నాకు శక్తి యివ్వాలి. మీ అందరూ సహకారం యివ్వాలని కొరుతూ, నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నందుకు కృతజ్ఞత చెబుతూ విరమిస్తున్నాను. జైహింద్.



**శ్రీ సి. జగన్నాథ రావు**

28-03-1972 నుండి 18-03-1974

# శ్రీ సి. జగన్నాథ రావు

శ్రీ జగన్నాథరావు అయిదవ శాసన సభ (1972-1978) డెప్యూటీ స్పీకర్‌గా 1972, మార్చి 28న ఏకగ్రీవంగా ఎన్నికై 1974 మార్చి 18 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు మెదక్ జిల్లా, నర్సాపూర్ గ్రామంలో 1932, మే 6న జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి బి. ఏ. మరియు లా డిగ్రీలను పూర్తి చేసినారు. న్యాయవాద వృత్తిని స్వీకరించి కొంత కాలము న్యాయవాదిగా కొనసాగారు.

వీరు 1947వ సంవత్సరములో నిజాం ప్రభుత్వమునకు వ్యతిరేకముగా 'క్విట్ హైదరాబాద్' ఉద్యమంలో చురుకుగా పాల్గొని 1948వ సంవత్సరములో జైలు శిక్షను అనుభవించారు.

వీరు 1959-1964 సంవత్సరములలో నర్సాపూర్ పంచాయితీ సమితి అధ్యక్షునిగా ఉన్నారు.

వీరు మెదక్ జిల్లా నర్సాపూర్ నియోజకవర్గం నుండి 1967వ సంవత్సరంలో మొదటిసారి రాష్ట్ర శాసనసభకు ఎన్నికైనారు. వీరు 1972 మరియు 1983 సంవత్సరాలలో కూడా నర్సాపూర్ నియోజకవర్గం నుండి ఎన్నికైనారు. వీరు 1972-1973, 1973-1974 సంవత్సరములలో అర్జీల, విశేషాధికారముల కమిటీల అధ్యక్షులుగా పనిచేశారు.

శ్రీ జగన్నాథరావు 1978 వ సంవత్సరంలో విధాన పరిషత్తు సభ్యునిగా ఎన్నికైనారు. వీరు శ్రీ టంగుటూరి అంజయ్య మంత్రి వర్గంలో ఆబ్కారి శాఖ మంత్రిగా, హోం మంత్రిగా ఉన్నారు. వీరు శ్రీ భవనం వెంకట్రాం మంత్రి వర్గంలో 1982, ఫిబ్రవరి 28 నుండి 1982, సెప్టెంబరు 20 వరకు ఉప ముఖ్యమంత్రిగా, హోం, పోలీసు, జైళ్లు మరియు రవాణా శాఖ మంత్రిగా ఉన్నారు. వీరు శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి మంత్రి వర్గంలో 1982, సెప్టెంబరు 20 నుండి 1983, జనవరి 9 వరకు పరిశ్రమల శాఖ మంత్రిగా సమర్థవంతంగా పనిచేశారు.

## శ్రీ సి. జగన్నాధరావు డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం.

అధ్యక్షా ! పెద్దలారా, స్నేహితులారా, చాలామంది మిత్రులు నా విషయమై చెప్పడం జరిగింది. ఈ సభలో నా కంటె అనుభవజ్ఞులు, పెద్దలు ఎంతో మంది ఉన్నప్పటికి నాకే ఈ అవకాశం ఇవ్వడం ముఖ్యమంత్రి గారు ఒక ఎక్స్‌పెరిమెంట్ చేస్తున్నారేమో అని నేను భావిస్తున్నాను. నేను మీ నాయకత్వంతోను మీ అనుభవంతోను లాభపడుతూ ఒకే మాట మనవి చేయదలచు కున్నాను. ప్రజాస్వామ్య సాంప్రదాయాల ప్రకారము నిష్పక్షపాతంగా మీ సలహా ప్రకారం ఈ సభాసదులందరికి అవకాశం కలుగచేస్తానని హామీ ఇస్తున్నాను. ఈ అవకాశం ఇచ్చిన పెద్దలకు మీకు నా హృదయపూర్వకమైన వందనములు తెలుపుతూ మరొకసారి ప్రజాస్వామిక సత్సాంప్రదాయాలను నిష్పక్షపాతంగా నిలబెడతానని హామీ ఇస్తూ సెలవు తీసుకుంటున్నాను. జైహింద్.



**శ్రీ సయ్యద్ రహ్మాత్ అలీ**

26-03-1974 నుండి 01-03-1978

# శ్రీ సయ్యద్ రహ్మత్ అలీ

శ్రీ సయ్యద్ రహ్మత్ అలీ ఐదవ శాసనసభ (1972-1978) డెప్యూటీ స్పీకరుగా 1974, మార్చి 26న ఏకగ్రీవంగా ఎన్నికై 1978, మార్చి 1 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు హైదరాబాదు పట్టణంలో 1930, నవంబరు 23న జన్మించారు. మున్షీ ఫాజిల్ విద్యను అభ్యసించారు.

శ్రీ రహ్మత్ అలీ ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనేట్ మెంబర్‌గా, వక్ఫ్‌బోర్డు అధ్యక్షునిగా పనిచేసినారు. 1964 వ సంవత్సరంలో హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషన్ సభ్యునిగా ఉన్నారు. 1965 వ సంవత్సరంలో డిప్యూటి మేయరుగా ఎన్నికైనారు. కొంత కాలం హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ స్టాండింగ్ కమిటి ఛైర్మన్‌గా ఉన్నారు.

వీరు 1972 వ సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో హైదరాబాదు నగరంలోని ఆసిఫ్‌నగర్ నియోజకవర్గం నుండి శాసన సభకు ఎన్నికయినారు. వీరు డెప్యూటీ స్పీకర్ హోదాలో అర్జీల, విశేషాధికారముల కమిటీల అధ్యక్షులుగా పనిచేశారు.

# శ్రీ సయ్యద్ రహ్మత్ అలీ డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, ఈ రోజు నన్ను ఏకగ్రీవంగా డిప్యూటీ స్పీకర్‌గా ఎన్నుకొన్నందుకు సభ్యులందరికి నా హృదయపూర్వక కృతజ్ఞత తెలుపుకొంటున్నాను. నన్ను డిప్యూటీగా ఎన్నుకొని ఈ ఆదర్శవంతమైన సభకు సేవచేయడానికి నాకు ఈ అవకాశము యిచ్చినందుకు మీ అందరికి, ముఖ్యంగా ముఖ్యమంత్రిగారికి, నా హృదయపూర్వక అభినందనములు. ఈ సభలో మంచి పద్ధతులను, ఆదర్శవంతమైన సాంప్రదాయాలను స్థాపించిన స్పీకరు రంగారెడ్డి గారి క్రింద నేను డిప్యూటీగా పనిచేయడం నా అదృష్టమని భావిస్తున్నాను. నాకు తెలుగు బాగా రాకుండినా, మీ ప్రేమ, సహకారముతో ఏ లోటు రాకుండా ఈ సభకు పక్షపాతము లేకుండా హృదయపూర్వకంగా సేవ చేస్తానని మీకు హామీ యిస్తున్నాను.



**శ్రీ కె. ప్రభాకర రెడ్డి**

28-03-1978 నుండి 16-10-1980

# శ్రీ కె. ప్రభాకర రెడ్డి

శ్రీ ప్రభాకర రెడ్డి ఆరవ శాసనసభ (1978-1983) డెప్యూటీ స్పీకర్‌గా 1978, మార్చి 28న ఏకగ్రీవంగా ఎన్నికై 1980, అక్టోబరు 16 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు రంగారెడ్డి జిల్లా హయత్‌నగర్ మండలం కొహెడ గ్రామంలో 1935, ఆగస్టు 10న జన్మించారు. బి.ఎస్.సి. డిగ్రీని ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి తీసుకున్నారు. వీరు హయత్‌నగర్ పంచాయితీ సమితి అధ్యక్షులుగా పనిచేసారు.

శ్రీ ప్రభాకర రెడ్డి 1970 నుండి 1976 వరకు రాష్ట్ర విధాన పరిషత్తు సభ్యునిగా ఉన్నారు. వీరు 1972, మార్చి 20 నుండి 1973, జనవరి 18 వరకు శ్రీ పి.వి. నరసింహారావు మంత్రి వర్గంలో రవాణా శాఖ మంత్రిగా పనిచేసారు.

వీరు 1978వ సంవత్సరంలో శాసనసభకు జరిగిన ఎన్నికలలో హైదరాబాదు జిల్లా మలక్‌పేట నియోజక వర్గం నుండి శాసనసభకు మొదటిసారిగా ఎన్నికైనారు. రాష్ట్ర శాసనసభ డెప్యూటి స్పీకరుగా ప్రతిపక్ష పార్టీ నుండి ఏకగ్రీవంగా ఎన్నికై చరిత్రను సృష్టించారు. వీరు డెప్యూటీ స్పీకర్ హోదాలో 1978-1979 సంవత్సరములలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా ఉన్నారు. వీరు శ్రీ అంజయ్య మంత్రి వర్గంలో హోం, అడవుల శాఖ మంత్రిగా ఉండి, మంత్రి వర్గ పునర్వవస్థీకరణలలో ఆర్థిక శాఖకు మంత్రిగా మార్చబడినారు.

## శ్రీ కె. ప్రభాకర రెడ్డి డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, మీరు, సభానాయకులు, ప్రతిపక్ష నాయకులు – వివిధ రాజకీయ పార్టీలకు చెందిన నాయకులు అంతా నన్ను అభినందిస్తూ కొన్ని మాటలు చెప్పారు. వాటికి నేను ఎంతవరకు అర్హుణ్ణో చెప్పలేను. వాటిని ఎంతవరకు రుజువు చేసుకోగలనో అర్థము కావడము లేదు. నిన్న సాయంకాలం నాలుగు గంటల వరకు – దీనికి నామినేషను ఫైలు చేసేవరకు నాకు తెలియదు. 4 గంటలకు శ్రీ లచ్చన్నగారు మీరు వచ్చి సంతకం పెట్టాలి అని చెప్పే వరకు నాకు తెలియదు ప్రజాస్వామ్యంలో ప్రతిపక్షాలకు ఇవ్వవలసిన ఓటు, ప్రాతినిధ్యం ఈనాడు దేశంలో అన్ని చోట్ల జరుగుతున్నా మన రాష్ట్రములో ప్రప్రథమంగా జరుగుతున్నదని మనవి చేస్తున్నాను. ఈ సందర్భములో సభానాయకులకు, పెద్దలందరికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

అధ్యక్షా, ఇదివరకు సభాపతి ఎన్నిక అప్పుడు ఉప సభాపతి ఎన్నిక అన్ని రాజకీయ పక్షాలు పెద్దలు కలిసి ఏకగ్రీవంగా ఎన్నికచేయడం ఈ సభకు ఒక మంచి సాంప్రదాయంగా నేను భావిస్తున్నాను. ప్రభుత్వ పక్షం వారికి, ప్రతిపక్షాల వారికి నేను హృదయపూర్వకంగా వందనాలు తెలుపుతున్నాను. ప్రజాస్వామ్య సాంప్రదాయాలు, ఈ సభా సాంప్రదాయాలు ఇది వరకు ఏ విధంగా జరిగాయో ఆ విధంగా జరపడానికి ప్రయత్నిస్తాననే హామీ ఇస్తున్నాను. నిష్పక్షపాతంగా, నిస్వార్థంగా సేవ చేసే మీ అడుగుజాడలలో నడుస్తానని మనవి చేస్తున్నాను. నా కంటే పెద్ద అనుభవజ్ఞులు, న్యాయ శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు, రాజకీయరంగంలో సేవ చేసిన వారు ఎందరో ఉన్నప్పటికి ఈ అవకాశం నాకు కలుగజేయబడినందుకు ధన్యుణ్ణిగా భావిస్తున్నాను. సభా నాయకులు చెన్నారెడ్డి గారు నా గురించి చెబుతూ ప్రజాస్వామ్య కార్యక్రమాలు తెలిసిన వాణ్ణని చెప్పారు. వారి ఆశీర్వాదాలతోనే నేను రాజకీయ రంగంలో ప్రవేశించాను. 25 సంవత్సరాలుగా వారితో కలిసి జిల్లాలో నేమీ, రాష్ట్రంలో నేమీ పనిచేసే అదృష్టం నాకు కలిగింది. వారు నాయకుడుగా ఉన్న సమయంలోనే నాకు ఈ పదవి లభించడం గొప్ప విషయంగా భావిస్తున్నాను. లచ్చన్న గారు నా మీద ఇంత గౌరవం, విశ్వాసం చూపించడం, ఎందరో పెద్దలు ఉండగా నన్ను వారు ఏకగ్రీవంగా నిర్ణయించడం గొప్ప భాగ్యంగా భావిస్తున్నాను. నేను ఏక గ్రీవంగా ఎన్నిక కావడంలో సహకరించిన పెద్దలు, మిత్రులందరకు ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. తప్పనిసరిగా ప్రజాస్వామ్య సాంప్రదాయాలు, ఈ సభా సాంప్రదాయాలు కాపాడడానికి ప్రయత్నిస్తానని మనవి చేసుకుంటూ, అందరికి ధన్యవాదాలు తెలుపుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.



శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి

27-03-1981 నుండి 06-09-1982

# శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి

శ్రీ అగరాల ఈశ్వర రెడ్డి ఆరవ శాసన సభ (1978-1983) డెప్యూటీ స్పీకర్‌గా 1981, మార్చి 27న ఏకగ్రీవంగా ఎన్నికై 1982, సెప్టెంబర్ 6 వరకు ఆ పదవిని నిర్వహించారు.

# శ్రీ ఎ. ఈశ్వరరెడ్డి డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

సభాధ్యక్షులు, ముఖ్యమంత్రిగారు, సభానాయకులు, ఇతర నాయకులు, ప్రతిపక్షనాయకులు, మిత్రులారా, ఈ రోజు మీరందరూ కలిసి నన్ను డెప్యూటీ స్పీకర్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నందుకు, తరువాత మీరందరూ నాకు ఈ శుభాకాంక్షలు తెలిపిన సందర్భంలో మీ అందరికి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. మన సభా నాయకులు చెప్పినట్లు – ఏదో ఎన్. ఎమ్. ఆర్. అపాయింట్‌మెంట్‌గా ఇప్పటివరకు సభా నిర్వహణ చేయడం జరిగిందని వారు చెప్పారు. ముఖ్యమంత్రిగారు కడు ప్రశంసనీయులు. ఇతడు ఎట్లా మెలుగుతాడు అసెంబ్లీలో ఆ సీటు మీద కూర్చున్నప్పుడు, అని చూసి, ఆ హుందాతనం, అర్హత ఇతనికి ఉందని వారు భావించిన తరువాత ప్రతి కార్నర్ నుంచి ప్రశంస వచ్చిన తరువాత వారు నిర్ణయం తీసుకున్నారేమో అని నేను అభిప్రాయపడుతున్నాను. ఆయన దానిని బట్టి ఒక శ్రామికవర్గమునకు చెందిన నాయకుడు – సరైన నిర్ణయం తీసుకున్నాడో లేక ఇక రాబోయే కాలంలో నా పరిస్థితి ఎట్లా ఉంటుందో అప్పుడు నేను ఏదో కొంత హేస్టీ నిర్ణయం తీసుకున్నానని అనుకుంటారో నాకు తెలియదు. పలువురు పెద్దలు ప్రశంసలు చెప్పారు. నేను పెద్ద ఏడ్వకేటును అన్నారు. నేను రికార్డు మీద పెద్ద ఏడ్వకేటును. పెద్దగా ప్రాక్టీసు చేసింది లేదు. ఒక సీనియర్ దగ్గర ఉన్నాను. పొలిటికల్ సైన్సు చదువు కొన్నాను. సభా సాంప్రదాయాలు, కన్వెన్షన్సు, కొంత తెలిసిన వాణ్ణి. ప్యానల్ ఆఫ్ చైర్మన్‌లో కూడా కొంత కాలం ఉండడం జరిగింది. Experience is a better school. ఆరిస్టాటిల్ తత్వశాస్త్రాలు చదివాను. అనుభవంవల్ల సభను సక్రమంగా నడిపించే శక్తి నాకు ఉందని నమ్మకం ఉంది. నేను రేబాల దశరథరామిరెడ్డి గారిని కలుసుకోవడం జరిగింది. వారు ఏమి నువ్వు రూలింగ్స్ ఇచ్చేస్తున్నావు అన్నారు. బాగా ప్రాక్టీసు చేసే లాయర్, ఆ రూలింగ్స్ చూసి వారి అభిప్రాయం చెప్పమని, ఏమన్నా తప్పులుంటే చెప్పమని నేను కోరినప్పుడు– వారు బాగానే ఉన్నాయి, కొంత మేర పార్లమెంటరీ ప్రాక్టీసు, సంప్రదాయాలు బాగా చదువు, మంచి రూలింగ్స్ ఇచ్చే ప్రయత్నం చేయి అని సలహా ఇవ్వడం జరిగింది. ఇంత పరిస్థితి



## శ్రీ కె. హరీశ్వర రెడ్డి

31-12-2001 నుండి 14-11-2003

నాకు అప్ప చెప్పిన దానికి, ముఖ్యమంత్రిగారు నాకు ఇంకా బాధ్యతలు పెట్టినందుకు – సభను నిష్పక్షపాతంగా నిస్వార్థంగా నడుపుతానని మనవి చేస్తున్నాను. ప్రతిపక్షాలకు ఒక హామీ చెపుతున్నాను. మీకు ఇవ్వవలసిన టైములో మీకు ఏదైనా తక్కువ చేసే అభిప్రాయం ఉండదని మనవి చేస్తున్నాను. నాకు ఇటువైపు చూసినప్పుడు భయం వేస్తుంది. శ్రీ వడ్డే రంగారావు నాకు టైము ఇవ్వలేదని వాకౌటు చేస్తున్నానని అన్నారు. తమ దగ్గరకు వచ్చి మాట్లాడాలంటే ఈ వైపు ఉండే సభ్యులు అభ్యంతరం చెప్పారు. మీరు కూర్చోండి అంటే ఆయన లేచి పోయాడు. ఇటువంటివి పెద్దగా పట్టించుకోకూడదు. సత్సాంప్రదాయాలతో, కన్వెన్షన్సుతో సభను నడిపిస్తానని మనవి చేస్తున్నాను. ఈ సభకు అంతరాయం లేకుండా చేస్తానని నమ్మకం ఉంది, పలువురు ప్రశంసలు అందజేశారు. వారి ప్రశంసలకు ధన్యవాదాలు తెలుపుతున్నాను. మీ సహకారం ఉంటే రాబోయే కాలంలో ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీని సక్రమంగా నిర్వహిస్తాను. పలువురు సభ్యులు వెలిబుచ్చిన దానికి నాకు అర్హత ఉందో లేదో గానీ ఆ పాయింట్ రీచ్ అయ్యేందుకు కృషి చేస్తాను. In my own ability, I will try my best to keep it going and get this Assembly to the red letter day అందరికి నా ధన్యవాదాలు మరోసారి తెలుపుతూ ఈ శుభ సమయంలో నాకు మర్యాద చేసిన మీ సెంటిమెంట్సుతో ఏకీభవిస్తూ సెలవు తీసుకొంటున్నాను.



శ్రీ ఐ. లింగయ్య

08-09-1982 నుండి 07-01-1983

# శ్రీ ఐరేని లింగయ్య

శ్రీ ఐరేని లింగయ్య ఆరవ శాసనసభ (1978-1983) డెప్యూటీ స్పీకర్‌గా 1982, సెప్టెంబరు 8న ఏకగ్రీవంగా ఎన్నికై 1983, జనవరి 7 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు మెదక్ జిల్లా దుబ్బాక గ్రామంలో 1918 వ సంవత్సరంలో జన్మించారు. వీరు నైజాంకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పాల్గొన్నారు.

శ్రీ లింగయ్య 1958 వ సంవత్సరం నుండి 1972వ సంవత్సరం వరకు ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్ సభ్యులుగా ఉన్నారు. వీరు 1978 వ సంవత్పరంలో జరిగిన ఎన్నికలలో మెదక్ జిల్లా దొమ్మాట నియోజక వర్గం నుండి రాష్ట్ర శాసనసభకు మొదటిసారి ఎన్నికైనారు. వీరు శాసనసభా కార్యకలాపాలను ఎంతో సమర్థవంతంగా, నిష్పక్షపాతంగా నిర్వహించి సభా గౌరవాన్ని , హుందాతనాన్ని నిలబెట్టి అన్ని పక్షాల సభ్యుల ఆమోదాన్ని పొందారు.

శ్రీ లింగయ్య 1983 వ సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో కూడా దొమ్మాట నియోజకవర్గం నుండి శాసనసభకు రెండవసారి ఎన్నికైనారు.

వీరు 1991, ఏప్రిల్ 1న మరణించారు.

# శ్రీ ఐరేని లింగయ్య డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, ఈ రోజు ఈ శాసన సభలో డెప్యూటీ స్పీకరుగా ఏకగ్రీవంగా నన్ను ఎన్నుకున్నందుకు వారిని నేను అభినందిస్తూ వారందరికి కృతజ్ఞత చెప్పుతున్నాను. యూనివర్సిటీ డిగ్రీలు చదువుకుని పోలిటిక్సు చదువుకుని మేము పోలటిక్సులోనికి వచ్చిన వారము కాదు, మేము ప్రజలతో పోలటిక్సు నేర్చుకున్నాము. ప్రజల భాషలో మాట్లాడుతాము. అదే నా స్వభావము అలవాటు. మేము చదువుకున్నది వీధి బడిలో, ఏ భాషలో మాట్లాడినా ప్రజలు నన్ను ఎట్లా గౌరవిస్తారో నాకు తెలుసు. ముఖ్యమంత్రిగారు నన్ను డెప్యూటీ స్పీకరుగా నామినేషను వేయమని చెప్పారు. నేను వారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. మిత్రులు అందరు నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకున్నందుకు వారికి నా హృదయపూర్వక అభినందనలు తెల్పుకుంటున్నాను.



## శ్రీ ఎ. భీమ్ రెడ్డి

22-03-1983 నుండి 28-08-1984

# శ్రీ ఎ. భీమ్ రెడ్డి

శ్రీ భీమ్‌రెడ్డి ఏడవ శాసనసభ (1983–84) డెప్యూటీ స్పీకరుగా 1983, మార్చి 22న ఏకగ్రీవంగా ఎన్నికై 1984, ఆగస్ట్ 28 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు ఆదిలాబాద్ జిల్లా నిర్మల్ తాలుకా మున్‌పల్లి గ్రామంలో 1948, మార్చి 2న జన్మించారు.

శ్రీ భీమ్‌రెడ్డి హైదరాబాదు నిజాం కళాశాల నుండి బి. ఎ. డిగ్రీని, ఉస్మానియా విశ్వవిద్యాలయం న్యాయకళాశాల నుండి లా డిగ్రీని తీసుకున్నారు. వీరు న్యాయవాది వృత్తిని స్వీకరించి ఉత్తమ న్యాయవాదిగా పేరుగాంచారు.

వీరు మల్లాపూర్ గ్రామ సర్పంచ్‌గా, నిర్మల్ పంచాయితీ సమితి ఉపాధ్యక్షులుగా పనిచేసారు.

శ్రీ భీమ్‌రెడ్డి 1983వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో శాసనసభకు ఆదిలాబాద్ జిల్లా నిర్మల్ నియోజకవర్గం నుండి శాసనసభ్యుడిగా ఎన్నికైనారు. వీరు డెప్యూటీ స్పీకర్ హోదాలో 1983–1984, 1984–1985 సంవత్సరములలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా ఉన్నారు.

వీరు శ్రీ భాస్కర రావు గారి మంత్రి వర్గములో 1984 ఆగస్టు 29 నుండి 1984, సెప్టెంబరు 16 వరకు ఆహారము, పౌరసరఫరాలు , క్రీడలు, క్రీడా సంఘాలు, యువజన సర్వీసుల శాఖ మంత్రిగా పనిచేసారు.

శ్రీ భీమ్‌రెడ్డి 1993, సెప్టెంబరు 19న మరణించారు.

# శ్రీ ఎ. భీమ్‌రెడ్డి డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

Hon'ble Speaker and Hon'ble Members, thanks to all the Hon'ble Members. I wish to place on record my profound gratefulness for the Hon'ble Members of the Andhra Pradesh Legislative Assembly for the confidence they have reposed in electing me as the Deputy Speaker of the Andhra Pradesh Legislative Assembly. I shall try at all the times to uphold the dignity of the Assembly and uphold the standard Parlimentary Democracy. In a Parliamentary Democracy such as the wishes of the people is expressed through their elected representatives. The Legislative body is sovereign and its decision shall be final. It is in the context that the constitutional histories and various democracies are respected with Parliamentary privileges. These privileges are however to be exercised with utmost self constraint for upholding the dignity of the House and decency of the people, the House represents.

It is gratifying for me that all the Members of this House are experienced Parliamentarians and therefore I have an abundant faith in their commitment to the Rule of Law and it is with the faith that I have accepted the onerous responsibility of being the Deputy Speaker and expect that all of you, having reposed in me the responsibility will ever co-operate with me in the partial discharge of my functions.



**శ్రీ ఎ.వి. సూర్యనారాయణ రాజు**

12-03-1985 నుండి 11-11-1989

# శ్రీ అల్లూరి వెంకట సూర్యనారాయణ రాజు

శ్రీ అల్లూరి వెంకట సూర్యనారాయణ రాజు ఎనిమిదవ శాసనసభ (1985-1989) డెప్యూటీ స్పీకర్‌గా 1985, మార్చి 12న ఏకగ్రీవంగా ఎన్నికై 1989, నవంబరు 11 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు విజయనగరం జిల్లా మాయిడ గ్రామములో 1946, మే 10న జన్మించారు. వీరు విజయవాడ ఆంధ్ర లయోల కళాశాల, రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాలలో చదివి. బి.కాం. డిగ్రీని పొందారు.

శ్రీ సూర్యనారాయణ రాజు తూర్పు గోదావరి జిల్లా రాజోలు మండలం, చింతలపల్లి గ్రామానికి సర్పంచిగా పనిచేశారు. వీరు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయ పరిశ్రమల సంస్థ అధ్యక్షునిగా పని చేసినారు.

వీరు తూర్పు గోదావరి జిల్లా రాజోలు నియోజకవర్గం నుండి రాష్ట్ర శాసనసభకు 1983వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో మొదటిసారి ఎన్నికైనారు. 1985వ సంవత్సరంలో శాసనసభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో రెండవసారి ఎన్నికైనారు. వీరు డెప్యూటీ స్పీకర్ హోదాలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా ఉన్నారు.

శ్రీ సూర్యనారాయణ రాజు 1994, 1999 సంవత్సరములలో జరిగిన ఎన్నికలలో తిరిగి రాజోలు నియోజకవర్గం నుండి శాసనసభ్యునిగా ఎన్నికైనారు. వీరు 1995-1996 సంవత్సరములలో విశేషాధికారాల కమిటి అధ్యక్షులుగా పనిచేసినారు. 2000-2001 సంవత్సరములో ప్రభుత్వ సంస్థల కమిటి అధ్యక్షులుగా ఉన్నారు. వీరు 2002-2003 సంవత్సరములో రాష్ట్రములో విద్యుత్ టవర్లు కూలిపోవుటపై విచారణ జరుపుటకు నియమించిన శాసనసభ కమిటికి అధ్యక్షులుగా ఉన్నారు.

## శ్రీ అల్లూరి వెంకట సూర్యనారాయణ రాజు డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

సభానాయకులైన ముఖ్యమంత్రిగారు, ప్రతిపక్ష నాయకులు, మిత్రపక్షాల నాయకులు, ఇతర గౌరవ సభ్యులు అందరికి నన్ను ఏకగ్రీవముగా ఈ శాసనసభ ఉపాధ్యక్షునిగా ఎన్నుకొన్నందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ సభా గౌరవాన్ని, సంప్రదాయాలను నిలబెట్టే విషయంలో గౌరవ సభ్యులంతా నాతో సహకరించవలసినదిగా కోరుతున్నాను.



శ్రీ ఆలపాటి ధర్మారావు

20-03-1990 నుండి 28-09-1992

# శ్రీ ఆలపాటి ధర్మారావు

శ్రీ ఆలపాటి ధర్మారావు తొమ్మిదవ శాసనసభ (1989-1994) డెప్యూటీ స్పీకర్‌గా 1990, మార్చి 20న ఏకగ్రీవంగా ఎన్నికై 1992, సెప్టెంబరు 28 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు గుంటూరు జిల్లా కొల్లిపర మండలం అన్నవరపు లంక గ్రామములో శ్రీ వెంకయ్య, శ్రీమతి శేషమ్మ దంపతులకు 1933, మే 15న జన్మించారు. బి.ఎ., బి.ఎల్., డిగ్రీలను ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి పొందారు. వీరు తెనాలిలో న్యాయవాది వృత్తిని చేపట్టి ప్రముఖ న్యాయవాదిగా పేరు గడించారు.

వీరు తెనాలి పురపాలక సంఘానికి మూడుసార్లు అధ్యక్షునిగా ఎన్నికైనారు. వీరు 1970-1978 సంవత్సరములలో తెనాలి పట్టణ సహకార బ్యాంకు అధ్యక్ష పదవిని నిర్వహించారు. వీరు 1978-1980 సంవత్సరములలో తెనాలి న్యాయవాదుల సంఘానికి అధ్యక్షునిగా ఉన్నారు. వీరు ఆ సమయంలో తెనాలి కోర్టు భవన నిర్మాణానికి కృషి చేసారు. వీరు 1980-1982 సంవత్సరములలో తెనాలి పి.ఎన్.ఆర్. మరియు ఎన్.వి. ఆర్. కళాశాలకు కార్యదర్శిగా పని చేసినారు. వీరు 1981-1984 సంవత్సరములలో జంపని సహకార చక్కెర కర్మాగారానికి అధ్యక్షునిగా ఉన్నారు.

శ్రీ ధర్మారావు 1985వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో గుంటూరు జిల్లా దుగ్గిరాల నియోజవర్గం నుండి రాష్ట్ర శాసనసభకు మొదటిసారి ఎన్నికైనారు. శ్రీ ధర్మారావు అనుగత చట్ట నిర్మాణ కమిటి, ప్రభుత్వ లెక్కల కమిటి, వివిధ బిల్లులపై సెలెక్ట్ కమిటీల సభ్యునిగా ఉన్నారు. వీరు శాసన సభలో అనేక విషయాలపై జరిగే చర్చలలో చురుకుగా పాల్గొనేవారు.

వీరు 1989వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో గుంటూరు జిల్లా వేమూరు నియోజకవర్గం నుండి శాసనసభకు రెండవసారి ఎన్నికైనారు. వీరు డెప్యూటీ స్పీకరుగా శాసనసభ కార్యకలాపాలను సమర్థవంతంగా నిర్వహించినారు. డెప్యూటీ స్పీకర్ హోదాలో అర్జీల కమిటీకి 1990-1991, 1991-1992 సంవత్సరాలలో అధ్యక్షులుగా ఉన్నారు.

శ్రీ  ధర్మారావు శ్రీ విజయభాస్కర రెడ్డి మంత్రివర్గంలో 1992, అక్టోబరు 10 నుండి 1993, సెప్టెంబరు 8 వరకు న్యాయం, కోర్టులు, రవాణా శాఖల మంత్రిగా, 1993, సెప్టెంబరు 10 నుండి 1994, డిసెంబరు 12 వరకు హోం, జైళ్ళు, అగ్నిమాపక శాఖల మంత్రిగా ఉన్నారు.

మంచి పరిపాలనాధక్షుడిగా పేరుగాంచిన శ్రీ ధర్మారావు 2003, మే 7న మరణించారు.

# శ్రీ ఆలపాటి ధర్మారావు డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, ఈ ఉపసభాపతి పదవికి నన్ను ఎంపిక చేసినందుకు సభాపతిగా మీకు, ముఖ్యమంత్రి డా. చెన్నారెడ్డి గారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను. వారి ఎంపికను ఆమోదించి, హర్షించి, మద్దతు ఇచ్చినందుకు కాంగ్రెస్ పార్టీ సభ్యులను అభినందిస్తున్నాను. వారు చేసిన ఎంపికను బలపరచి, ఈనాడు ఏకగ్రీవంగా ఎన్నిక కావడంలో తోడ్పడిన ప్రతిపక్ష సభ్యులకు, ప్రతిపక్ష నాయకులకు హృదయపూర్వకంగా ధన్యవాదములు తెలుపుతున్నాను. పెద్దలు డా. చెన్నారెడ్డి గారి నుంచి క్రొత్తగా ఎన్నికయిన సభ్యుల వరకూ, అధికారపక్ష సభ్యులు, ప్రతిపక్ష సభ్యులు కూడా నా గురించి చాలా మంచి మాటలు చెప్పారు. వారికి నా పట్ల గల అభిమానానికి సుహృద్భావానికి నిదర్శనంగా భావిస్తున్నాను. ఆ మాటలు అనిపించుకోవడానికి నాకు అర్హత ఉందో లేదో కానీ మొత్తం మీద వారు చేసిన సూచనల మేరకు వ్యవహరించడానికి, వారి నమ్మకాన్ని నిలబెట్టడానికి నేను శక్తివంచన లేకుండా తప్పకుండా ప్రయత్నిస్తానని మనవి చేస్తున్నాను. గత 5 సంవత్సరాల శాసనసభా కాలంలో ఏమయినా మా బాధ్యతను మేము నిర్వహించగలిగామంటే, అనుభవం పొందగలిగామంటే ఆ ఘనత అప్పటి ప్రతి పక్షనాయకులు బాగారెడ్డి గారికే దక్కుతుంది. చాలా అపారమైన అనుభవం, మంచి పరిజ్ఞానం కలిగిన వారి 'ఏబుల్ గైడెన్స్' లో ఎంతో నేర్చుకున్నాము. అందుకు నేను సంతోషిస్తున్నాను. నా వైపు నుంచి నిష్పక్షపాతంగా వ్యవహరించడానికి ప్రయత్నిస్తాను. అన్ని పార్టీల వారు సహకరించి, ఈ హుందాతనాన్ని, గౌరవాన్ని కాపాడడంలో తోడ్పడతారని ఆశిస్తున్నాను. స్పీకరు గారికి నా శాయశక్తులా సహకారాన్ని అందించడానికి తోడ్పడతానని పరస్పరం ఒకరినొకరు సహకరించుకుంటూ, ఈ సభా కార్యక్రమాన్ని హుందాగా, రాష్ట్ర ప్రజలకు ఎంతగానో ఉపయోగపడేట్లు కొనసాగించడంలో విజయం సాధించగలమని ఆశిస్తూ, కృతజ్ఞతలతో సెలవు తీసుకుంటున్నాను.



## శ్రీ బూరగడ్డ వేదవ్యాస్

29-12-1993 నుండి 10-12-1994

# శ్రీ బూరగడ్డ వేదవ్యాస్

శ్రీ బూరగడ్డ వేదవ్యాస్ తొమ్మిదవ శాసనసభ (1989-1994) డెప్యూటీ స్పీకర్‌గా 1993, డిసెంబరు 29న ఏకగ్రీవంగా ఎన్నికై 1994, డిసెంబరు 10 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు 1959, సెప్టెంబరు 26న భీమవరంలో జన్మించారు.

శ్రీ వేదవ్యాస్ ప్రాథమిక విద్యను మచిలీపట్నంలోను, బి. ఎ. డిగ్రీని హైదరాబాదులోని ఎ.వి. కళాశాలలోను చదివారు. బి. ఎల్. డిగ్రీని ఏలూరు సి.ఆర్. కళాశాలలో పూర్తి చేసిన అనంతరం మచిలీపట్నంలో న్యాయవాదిగా పనిచేసారు.

వీరు 1989వ సంవత్సరములో కృష్ణా జిల్లా మల్లేశ్వరం నియోజకవర్గం నుండి మొదటిసారిగా శాసనసభకు ఎన్నికైనారు. శ్రీ వేదవ్యాస్ కొంతకాలము ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంస్థ డైరెక్టర్‌గా ఉన్నారు. అలాగే వీరు వివిధ శాసనసభ కమిటీలలో సభ్యునిగా కూడా ఉన్నారు.

శ్రీ వేదవ్యాస్ డెప్యూటీ స్పీకర్ హోదాలో 1993-94 సంవత్సరంలో అర్జీల కమిటి అధ్యక్షునిగా ఉన్నారు.

వీరు 2004 సంవత్సరంలో జరిగిన ఎన్నికలలో మల్లేశ్వరం నియోజకవర్గం నుండి రెండవసారి ఎన్నికై ప్రస్తుతం 2004-2005 శాసనసభ అంచనాల కమిటి అధ్యక్షులుగా ఉన్నారు.

## శ్రీ బూరగడ్డ వేదవ్యాస్  డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

అధ్యక్షా, గౌరవ సభ్యులకు కృతజ్ఞత తెలుపుకొనే అవకాశం కూడా నాకు ఇవ్వకపోతే ఎట్లా ? ఉప సభాపతి పదవికి నా పేరును ప్రతిపాదించిన గౌరవ ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డి గారికి, ఆర్థిక శాఖామాత్యులు రోశయ్యగారికి, మంత్రివర్యులు డి. శ్రీనివాస్‌గారికి, మంత్రివర్యులు బేగ్ గారికి, చీఫ్ విప్ గారికి, జె.కె. రెడ్డి గారికి, పువ్వాడ నాగేశ్వరావు గారికి, బోడేపూడి వెంకటేశ్వరరావు గారికి కృతజ్ఞతలు. నన్ను ఏకగ్రీవంగా ఉప సభాపతి పదవికి ఎన్నుకొన్నందుకు అన్ని పక్షాల వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో  శాసనసభ  అత్యున్నతమైన స్థానం, ఒక దేవాలయం. ప్రజల సమస్యల్ని గురించి చర్చించి, ప్రజల క్షేమం, సంక్షేమం కొరకు నిర్ణయాలు తీసుకోవలసింది ఈ శాసనసభ. ఎంతో మంది పెద్దలు, మహానుభావులు సభాపతి, ఉపసభాపతి పదవులు నిర్వహించడానికి చిన్న వయస్సు కలిగిన నన్ను ఉపసభాపతిగా ఎన్నుకొన్నందుకు మీ అందరికి కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. నేను పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉన్నత విలువలు కలిగినటువంటి శాసనసభను  రాగద్వేషాలకు అతీతంగా నిష్పక్షపాతంగా నిర్వహించి అందరి మన్ననలను పొందుతాననీ, అందరి  ఆదరాభిమానాలను చూరగొంటానని  మనవిచేస్తున్నాను. ఈ 20వ శతాబ్దంలో  ఐరోపా, ఏషియా దేశాలలో జరిగే మార్పులు చూస్తుంటే ప్రజాస్వామ్య వ్యవస్థలోనే ఈ ప్రపంచంలోని ఏ దేశమైనా మనగలుగుతుందని ప్రపంచంలోని అనేక దేశాల ప్రజలు  ప్రజాస్వామ్యంవైపే మొగ్గుచూపుతున్నారు. అలాంటి పరిస్థితులలో మనది చక్కటి సాంప్రదాయం కలిగిన ప్రజాస్వామ్యం. ఇంకా పటిష్టంగా ఉండి అనేకమైన మంచి నిర్ణయాలు తీసుకోవాలి. ఈ మధ్యకాలంలో కొన్ని అపశృతులు వినబడుతున్నా ఇక్కడి మన ప్రవర్తనా, నడవడి ప్రజలందరూ చూస్తారు కనక మనం ఈ సభను హుందాగా నడిపి, అందరం మంచి పేరు తెచ్చుకొనే విధంగా వ్యవహరించాలని ఆకాక్షింస్తున్నాను. సభాపతికిగానీ, ఉప సభాపతికిగానీ సంక్రమింపజేసిన అధికారాలు సభను చక్కగా నిర్వహించేందుకే కాబట్టి గౌరవ సభ్యులంతా అందుకు సహకరించి సభను చక్కగా నడిపించే అవకాశాన్ని కలుగజేయవలసిన అవసరం కూడా ఉంది. చక్కటి సాంప్రదాయాలు కలిగినటువంటి మన సభకు నన్ను ఎన్నుకొన్నందుకు తప్పకుండా నిష్పక్షపాతంగా వ్యవహరిస్తాననీ, నన్ను మరీ మరీ అభినందిస్తూ మాట్లాడిన పెద్దలందరికి, ముఖ్యంగా మన ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటూ ముగిస్తున్నాను.



## శ్రీ యన్. మహమ్మద్ ఫారూఖ్

17-01-1995 నుండి 09-10-1999

# శ్రీ నస్యం మహమ్మద్ ఫరూక్

శ్రీ నస్యం మహమ్మద్ ఫరూక్ పదవ శాసనసభ (1994-1999) డెప్యూటీ స్పీకర్‌గా 1995, జనవరి 17న ఏకగ్రీవంగా ఎన్నికై 1999, అక్టోబరు 9 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు కర్నూలు జిల్లా నంద్యాల పట్టణంలో 1950, మే 15న జన్మించారు. నంద్యాల మున్సిపల్ ఉన్నత పాఠశాలలో సెవెన్త్ ఫామ్ చదివినారు.

శ్రీ ఫరూక్ 1981-1983 సంవత్సరములలో నంద్యాల పురపాలక సంఘానికి ఉపాధ్యక్షునిగా ఉన్నారు. వీరు 1985, 1994, 1999 సంవత్సరాలలో జరిగిన ఎన్నికలలో కర్నూలు జిల్లా నంద్యాల నియోజకవర్గం నుండి శాసనసభకు ప్రాతినిధ్యం వహించారు.

శ్రీ ఫరూక్ 1985వ సంవత్సరములో శ్రీ నందమూరి తారక రామారావు మంత్రి వర్గములో 1985, మార్చి 9 నుండి 1987, జూలై 11 వరకు చక్కెర, వక్ఫ్, ఉర్దూ అకాడమీ శాఖ మంత్రిగా పనిచేసారు.

వీరు డెప్యూటీ స్పీకర్‌గా విధులను చక్కగా నిర్వర్తించారు. డెప్యూటీ స్పీకర్ హోదాలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్ష పదవులను నిర్వహించారు.

శ్రీ ఫరూక్ శ్రీ చంద్రబాబు నాయుడు మంత్రి వర్గంలో 1999, నవంబరు 22 నుండి 2002, సెప్టెంబరు 11 వరకు పురపాలన, పట్టణాభివృద్ధి, అల్పసంఖ్యాక వర్గాల సంక్షేమం, వక్ఫ్, ఉర్దూ అకాడమీ శాఖ మంత్రిగా పనిచేసారు. వీరు మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణలో 2002, సెప్టెంబరు 11 నుండి 2004, మే 14 వరకు ఉన్నత విద్య, అల్ప సంఖ్యాక వర్గాల సంక్షేమం, వక్ఫ్, ఉర్దూ అకాడమీ శాఖ మంత్రిగా ఉన్నారు.

# శ్రీ నస్యం మహమ్మద్ ఫరూక్ డెప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

గౌరవనీయ శాసనసభా పక్ష నాయకులు, గౌరవనీయులైన ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుగారు, గౌరవ మంత్రివర్యులు, మిత్రపక్షాల సభ్యులకు, ప్రతిపక్షాల సభ్యులందరికీ, ఇండిపెండెంటు సభ్యులకు అదేవిధంగా మజ్లిస్‌పార్టీ సభ్యులైన రెండు పార్టీల వారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ శాసనసభలో మహోన్నతమైన వ్యక్తులు, రాజకీయ అనుభవం కలిగిన వ్యక్తులు,సభాపతి ఉన్నారు. ఉపసభాపతి విధుల నిర్వహణకు ఒక మైనారిటీ కులానికి చెందిన నన్ను శాసనసభ డెప్యూటీ స్పీకర్‌గా నియమించినందుకు గౌరవనీయ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుగారికి మరొకసారి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఏకాభిప్రాయంతో సహకరించిన అందరికీ మంత్రులకూ మిత్రపక్ష, ప్రతిపక్షాల వారందరికీ నా ప్రత్యేకమయిన కృతజ్ఞతా వందనాలు తెలియజేస్తున్నాను. ప్రజల సమస్యలను చర్చించేదానికి వారి సంక్షేమానికి, క్షేమానికి శాసనసభ ఒక పవిత్రమైన ప్రదేశం. ఇటువంటి ఉన్నతమైన శాసనసభ సమయాన్ని వృధా చేయకుండా ప్రజా సమస్యలను దృష్టిలో ఉంచుకుని మనం అంతా కార్యకలాపాలను హుందాగా, గౌరవంగా నడుపుకునే విధంగా, సంప్రదాయాలను నిలుపుకునే విధంగా నిర్వహించవలసి వుంటుంది. సభా కార్యక్రమాలను ఈ విధంగా నిర్వహించవలసిందిగా మీ అందరికీ మనవిచేస్తూ ఇందుకు కావలసిన సహాయ సహకారాలను అందచేయవలసిందిగా మీకు మరొకసారి విజ్ఞప్తిచేస్తున్నాను. ఈ శాసనసభలో జరిగే ప్రతి విషయంలో పత్రికలు విశిష్టమయిన పాత్ర నిర్వహించవలసి ఉంటుంది. అందుకని గ్యాలరీలో ఉన్న పాత్రికేయులు ఈ శాసనసభలో జరిగింది జరిగినట్లుగా తెలియజేయగలరన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తు న్నాను. రాగద్వేషాలకు, కులమతాలకు అతీతంగా శాసనసభ హుందాతనాన్ని నిష్పక్షపాతంగా నిర్వహిస్తానని మీ అందరికీ మరొకసారి మనవి చేసుకుంటూ నా గురించి ఈ సభలో ఎంతోమంది అనుభవజ్ఞులు, శాసనసభ్యులు అందరూ అభినందనలు తెలియజేసినందుకు మీ అందరికీ కృతజ్ఞతలు తెలియజేస్తూ ఈ అవకాశం కలుగజేసిన గౌరవసభాపతిగారికి ధన్యవాదాలు తెలియజేస్తూ సెలవు తీసుకుంటున్నాను.



శ్రీ కె. చంద్రశేఖర రావు

17-11-1999 నుండి 01-05-2001

# శ్రీ కల్వకుంట చంద్రశేఖర్ రావు

శ్రీ కల్వకుంట చంద్రశేఖర్‌రావు పదకొండవ శాసనసభ (1999-2003) డెప్యూటీ స్పీకర్‌గా 1999, నవంబరు 17న ఏకగ్రీవంగా ఎన్నికై 2001, మే 1 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు మెదక్‌జిల్లా సిద్ధిపేటలో 1954, ఏప్రిల్ 3న జన్మించారు. ప్రాథమిక విద్యను సిద్ధిపేటలోను, బి.ఎ. (లిటరేచర్) సిద్ధిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో చదివినారు.

శ్రీ చంద్రశేఖర్‌రావు వరుసగా 1985, 1989, 1994, 1999, 2004 సంవత్సరములలో జరిగిన ఎన్నికలలో మెదక్‌జిల్లా సిద్ధిపేట నియోజకవర్గం నుండి శాసన సభకు ఎన్నికైనారు.

వీరు 1989వ సంవత్సరములో రాయలసీమ జిల్లాలలో అక్రమ ఆయుధాలను, బాంబులను వెలికితీయడానికై నిర్వహించిన దాడులలో అక్రమంగా ప్రజలను పోలీసులు వేధించడంపై ఏర్పాటుచేసిన శాసనసభా కమిటీకి అధ్యక్షులుగా ఉన్నారు.

శ్రీ చంద్రశేఖర్‌రావు 1995-1996 సంవత్సరాలలో ప్రభుత్వ సంస్థల కమిటీ అధ్యక్షులుగా ఉన్నారు. అనంతరం వీరు శ్రీ చంద్రబాబునాయుడు మంత్రివర్గంలో 1996, డిసెంబరు 19 నుండి 1999, అక్టోబరు 11 వరకు రవాణాశాఖ మంత్రిగా పనిచేసినారు.

వీరు 2001 మే 1న శాసనసభ డెప్యూటీ స్పీకర్ పదవికి, శాసన సభ్యత్వానికి రాజీనామా చేసి, తిరిగి వీరు సిద్ధిపేట అసెంబ్లీ నియోజకవర్గానికి జరిగిన ఉప ఎన్నికలలో 2001, సెప్టెంబర్ 22న శాసనసభకు ఎన్నికైనారు.

వీరు 2004వ సంవత్సరంలో లో జరిగిన ఎన్నికలలో సిద్ధిపేట నియోజకవర్గం నుండి రాష్ట్రశాసనసభకు మరియు కరీంనగర్ పార్లమెంటరీ నియోజక వర్గం నుండి లోక్‌సభకు ఎన్నికైనారు. రాష్ట్ర శాసనసభ సభ్యత్వాన్ని వదులుకొని ప్రస్తుతం లోక్‌సభ సభ్యునిగా కొనసాగుతున్నారు.

శ్రీ చంద్రశేఖర్‌రావు, శ్రీ మన్మోహన్‌సింగ్ కేంద్ర మంత్రివర్గంలో 2004, మే 22న నౌకాయాన మంత్రిగా, తరువాత జరిగిన మంత్రి వర్గ పునర్వ్యవస్థీకరణంలో 2004, నవంబరు 22 నుండి కార్మిక శాఖ మంత్రిగా పని చేస్తున్నారు.

## శ్రీ కల్వకుంట చంద్రశేఖర్‌రావుగారు డిప్యూటీ స్పీకరుగా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

ఈ 11వ శాసన సభకు ఉపసభాపతిగా ఎంపిక చేయడానికి నా పేరును ప్రతిపాదించిన గౌరవనీయులు నారా చంద్రబాబునాయుడుగారికి నేను హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేసుకుంటు న్నాను. గౌరవ ప్రతిపక్ష నాయకులు కేంద్రంలో గల సాంప్రదాయాన్ని కొనసాగిస్తూ, మన రాష్ట్రంలో కూడా ప్రతిపక్షానికి డెప్యూటీ స్పీకర్ పదవి ఇవ్వాలని కోరినప్పుడు, మన రాష్ట్రంలో ఆ సాంప్రదాయం లేనందువల్ల ఈ రకమైన పరిణామం వస్తే, నా పేరును ప్రతిపాదించి నప్పుడు, వారు కూడా సహకరించి, వారి అభ్యర్థిని పోటీ పెట్టకుండా సహకరించినందుకు వై.ఎస్. రాజశేఖరరెడ్డిగారికి కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. బి.జె.పి. నాయకులు గౌరవ ఇంద్రసేనారెడ్డిగారికి, ఎం.ఐ.ఎం. నాయకులు సజ్జాద్‌గారికి, సి.పి.ఎం. నాయకులు నర్సింహయ్య గారికి కూడా ధన్యవాదాలు తెలియజేస్తూ నేను ఏకగ్రీవంగా ఎన్నికయ్యేందుకు సహకరించిన ప్రతి ఒక్కరికి నా ధన్యవాదాలు తెలియచేస్తున్నాను. చాలమంది గౌరవ మంత్రులు, సీనియర్ శాసనసభ్యులు, వివిధ పక్షాల నాయకులు అందరూ కూడా నేను ఈ పదవికి ఎన్నికయినందుకు అభినందనలు తెలియచేసినందుకు వారికి పేరు పేరున ప్రతి ఒక్కరికీ హృదయపూర్వకంగా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. అభినందనలు తెలియచేసే క్రమంలో కొందరు సభ్యులు కొన్ని సూచనలు చేశారు. ఒకసారి స్పీకర్, డెప్యూటీ స్పీకర్ స్థానాలకు ఎంపిక అయిన తరువాత నిష్పక్షపాతంగా, ప్రజోపయోగకరమైన ఫలవంతమైన చర్చలు ఈ సభలో చోటుచేసుకునే అందరికి అవకాశాలు అభించే విధంగా ప్రవర్తించడం ఉదాత్తంగా ఉంటుందని నా వ్యక్తిగత అభిప్రాయం. అందుకోసం కొత్తగా వచ్చిన శాసనసభ్యులు, మిత్రులు రామకృష్ణారెడ్డిగారు చెప్పారు. నాకు భయంగా ఉంది. ఇక్కడ పరిస్థితి చూస్తుంటే మరొకరకంగా ఉంది అన్నారు. అలాంటి భయాలు కొత్తగా వచ్చిన శాసన సభ్యులకు అవసరంలేదు. సీనియర్ శాసనసభ్యులు ఇచ్చిన స్ఫూర్తితో అన్ని విషయాల్లో అందరికి కూడా అవకాశాలు లభిస్తాయి. అందరూ చర్చించవచ్చు. అటువంటి దానికి ఏమీలేదు. అయితే ఇందాక చాలామంది సభ్యులు, సభానాయకులు తెలియజేసినట్లు నేను గత 15 సంవత్సరాల నుంచి వివిధ స్థానాలలో ఉండడం జరుగుతోంది. నాకుకలిగిన అనుభవాలనుంచి, మనం తీసుకోవలసిన చర్యల గురించి ఒక్కమాట రేఖామాత్రంగా ఇప్పుడు ప్రస్తావించదలచు కున్నాను.

నూతన సహస్రాబ్దిలోకి ప్రపంచ మానవాళి అడుగిడబోతున్న ఈ తరుణంలో చట్టసభలు ఎక్కడైతే స్ఫూర్తివంతంగా, ఉపయుక్తమైన చర్చలు చేస్తూ ప్రయోజనకరమైన కార్యక్రమాలకు నెలవులుగా ఎక్కడైతే ఉంటాయో అక్కడ ఆయా సమాజాలు అద్భుతమైన అభివృద్ధి కార్యక్రమాలను, ఫలితాలను ఆవిష్కరించుకుంటున్నాయి. ప్రజాస్వామ్యంలో ప్రతి ప్రజా ప్రతినిధి ఏ స్థాయిలో ఉన్న వ్యక్తి అయినా అధికారపక్షం వారైనా, ప్రతిపక్షంవారైనా ప్రజాస్వామ్యం యొక్క అంతిమ లక్ష్యం 'ప్రమోషన్ ఆఫ్ హ్యూమన్ వాల్యూస్' 'ఉన్నత మానవ విలువల సాధన' ఏకైక లక్ష్యం. కాబట్టి ప్రతి ఒక్కరు కూడ ఈ ప్రజాస్వామ్య సౌధంలో ఉన్నటువంటి వారందరమూ పని చేయగలిగితే తప్పకుండా మనం కూడ అద్భుతమైన ఫలితాలు సాధించగలుగుతాము. ఇక్కడున్న శాసనసభకు మన దేశంలోనే ఒక ప్రత్యేకత ఉంది. చాలా చక్కటి పద్ధతిలో చక్కటి పంథాలో పనిచేసే శాసనసభగా మన రాష్ట్ర శాసనసభకు కీర్తి ప్రతిష్ట ఉంది. ఆ ప్రతిష్టను ఇంకా ఇనుమడింప చేయడానికి, పెంచడానికి మీ అందరి సహకారం తీసుకుని, స్పీకర్‌గారి సహకారం పొంది తప్పకుండా మీరు అప్పగించిన ఈ బాధ్యతను మన రాష్ట్ర శాసనసభ యొక్క గౌరవం ఇనుమడింప చేసే విధంగా నేను కృషిచేస్తానని, నేను మీ అందరి గౌరవాన్ని పొందేవిధంగా ప్రయత్నం కూడ చేస్తానని, మీరు అందరూ కూడా హృదయపూర్వకంగా ఈ రోజు అభినందనలు ఏ విధంగా అందించారో సహకారం కూడ అదేవిధంగా అందించాలని, నా కర్తవ్యాన్ని నిర్వహించేవిధంగా అందరూ సహకరించాలని కోరుతూ నాకు అభినందనలు తెలియజేసినందుకు, ఈ అవకాశం కల్పించినందుకు ప్రతి ఒక్కరికి మరొక్కసారి హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేసు కుంటున్నాను.

# శ్రీ కొప్పుల హరీశ్వర్ రెడ్డి

శ్రీ హరీశ్వర్ రెడ్డి పదకొండవ శాసనసభ (1999-2003) డెప్యూటీ స్పీకర్‌గా 2001, డిసెంబరు 31న ఏకగ్రీవంగా ఎన్నికై 2003, నవంబరు 14 వరకు ఆ పదవిని నిర్వహించారు.

వీరు రంగారెడ్డి జిల్లా పరిగి గ్రామంలో 1947, మార్చి 18న జన్మించారు. హెచ్.ఎస్.సి. విద్యను పూర్తి చేసినారు.

శ్రీ హరీశ్వర్ రెడ్డి 1975వ సంవత్సరం నుండి 1980వ సంవత్సరం వరకు పరిగి గ్రామ సర్పంచ్‌గా ఉన్నారు. 1980-1985 సంవత్సరాల మధ్య కాలంలో పరిగి సమితి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. 1985వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలో మొదటిసారిగా రంగారెడ్డి జిల్లా పరిగి నియోజకవర్గం నుండి రాష్ట్రశాసనసభకు ఎన్నికైనారు. వీరు 1986-1988 సంవత్సరాలలో ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పోరేషన్ డైరెక్టర్‌గా ఉన్నారు. 1988-1989 సంవత్సరాలలో తిరుమల తిరుపతి దేవస్థానాల బోర్డు మెంబరుగా ఉన్నారు. వీరు 1989-1990 సంవత్సరాలలో శాసనసభ అనుగత చట్ట నిర్మాణ కమిటి అధ్యక్షులుగా పనిచేసారు.

శ్రీ హరీశ్వర్ రెడ్డి 1994, 1999, 2004 సంవత్సరములలో వరుసగా పరిగి నియోజకవర్గం నుండి శాసనసభ్యుడిగా ఎన్నికైనారు. వీరు 1997 వ సంవత్సరం నుండి 2000 సంవత్సరం వరకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సంస్థ అధ్యక్షులుగా పనిచేసారు. వీరు 1997-1999 సంవత్సరములలో సెక్రటేరియట్, హైకోర్టు భవనములకు రోడ్లు, భవనముల శాఖ చేపట్టిన పనులలో జరిగిన అవకతవకలకు సంబంధించి ఏర్పాటు చేసిన శాసనసభా కమిటి అధ్యక్షులుగా వ్యవహరించారు.

వీరు శాసనసభ ప్యానెల్ ఛైర్మన్‌గా, వివిధ కమిటీలలో సభ్యునిగా ఉన్నారు. వీరు 2002-2003 సంవత్సరములలో డెప్యూటీ స్పీకర్ హోదాలో అర్జీల, విశేషాధికారాల కమిటీల అధ్యక్షులుగా ఉన్నారు.

## శ్రీ హరీశ్వర్ రెడ్డి డెప్యూటీ స్పీకర్‌గా ఎన్నికైన సందర్భంగా చేసిన ప్రసంగం

పదకొండవ శాసనసభకు నన్ను డెప్యూటీ స్పీకర్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నందుకు గౌరవ ముఖ్యమంత్రి గారికి, గౌరవ ప్రతిపక్ష నాయకులు రాజశేఖర్ రెడ్డి గారికి, ఇంద్రసేనారెడ్డి గారికి, పెద్దలందరికీ, ప్రతి ఒక్క శాసనసభ్యుడికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలియచేసు కుంటున్నాను. మీరు చెప్పిన విషయాలన్నింటిని దృష్టిలో పెట్టుకొని, పార్టీలకతీతంగా ఈ సభను నిర్వహించడానికి మీ అందరి సహకారం తీసుకొంటాను. ఈ రోజున మీరు నా మీద చూపినటువంటి ఆదరాభిమానాల్ని నేను ఎప్పుడూ మరచిపోను. ఈ సభ యొక్క హుందాతనాన్ని నిలబెట్టడంలో మీరు ఇచ్చిన సూచనల్ని తు.చ. తప్పకుండా పరిగణనలోకి తీసుకుంటాను. మీ అందరి సహకారంతో తప్పకుండా ఈ సభను హుందాతనంగా నిర్వర్తించగలనని చెపుతూ, మరొక్కసారి మనస్ఫూర్తిగా మీ అందరికీ కృతజ్ఞతలు తెలియ చేసుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.

